# యయాతి చరిత్రము.

---

ఈ యచ్చ తెలుఁగు ప్రబంధము

## పొన్నికంటి - తెలగనార్యునిచే,

రచియింపఁబడినది.

---

రెండవ కూర్పు.

---

రాజమహేంద్రవరము.

శ్రీ వివేకవర్ధనీ ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

1895.

---

వెల 6 అణాలు.

# యయాతిచరిత్రము.

---

ఈయచ్చతెలుఁగు ప్రబంధము

పొన్నికంటి-తెలగనార్యునిచే,

రచియింపఁబడినది.

---

రెండవకూర్పు.

---

రాజమహేంద్రవరము.

శ్రీ వివేకవర్ధనీ ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

---

1895.

వెల ౹౼ అణాలు.

# యయాతిచరిత్ర.

## ప్రథమాశ్వాసము.

---

చ. సిరులమెఱుంగుఁబోఁడి తనచెక్కులు నిబ్బెపు గబ్బిగుబ్బలన్
బరువడి నాల్గుచేతులను బట్టఁగ నవ్వఁదలంచి కేలుఁ దా
మరఁ గుడికన్నుమూయుటకు మాటికి నవ్వెడు వెన్నుఁడింపుతోఁ
దిరముగఁ బ్రోచుఁ గావుత మదిం జెలరేఁగి యమీనుఖానునిన్.

వ. అని యిచ్చం జెలంగు జేజేదొరం దలంచి యచ్చతెనుంగుఁ గబ్బం బొక్కటి యొనరింపం దలంచి యున్నయెడ

సీ. తెలఁగంటిదొరరాల తెగలఁ దీటిన కోటనిగనిగల్ నలుగడల్ నిండియుండఁ
దమ్ములవిందురా కొమ్ములదగదగల్ వెలుఁపుఁబ్రోలిడ్ల విరియఁజేయఁ
గొత్తడంబుల కెంపుఁ గ్రొత్తడంబుల రంగు నింగికిఁ దోపు వన్నియలు నింపఁ
గడలియానని చిల్వపడఁతి చాలఁగ డిత తెలినీట నేప్రొద్దుఁ గలసియుండ
మిసిమిబంగారు మేడలమీఁది యెడల । నిడిన ముత్యాలఁ జుక్కలఁ బడఁబడఁగ
దెలియ కెల్లరు వెఱఁగందనలరు నెపుడు । మేలువజ్జీర్ల గమికొండ గొలకొండ.

క. ఆపీడేలున్ సొబగుల । పూఁబిల్తుఁడు నిచ్చ చాగపుంబులియనఁగా
దీవులకుఁ బాదుసాలకు । దేవర యిభరామశాహు తేజదరంగన్.

చ. పురమునఁ నోడిపోయి మతిత్రోవలు గానక మార్తురెంత నే
ర్పరు లిభరామశాహువు తిరంబుగ నందను జేరితోంటి య
చ్చెరువగుసొమ్ము రాకొమరు చేఁగడు మొక్కులుఁ గాంతురౌఁగదా
వెరవరులైనవారలకు వింతయె యాసిరు లెందునుండినన్.

సీ. తెలివిసింగంపు గద్దియలరా తెలఁగంటిదొరలెల్ల మోడ్పుఁజేతుల నెవ్వాఁ
బూనిరోఁ బదియాఱుమానిసి నెలవుల పుడమిఱేండ్లాశిగంబులకుఁ జోరఁగ,
శీవి మున్నిటిలో దీవులన్నియు నేలు మన్నీలు మెట్టుఁదాపరల కెరఁగఁ
దన తేజు సుడిగట్టు వెనుకచీఁకటి నెల్ల విరియించు తమ్ములవిందు గాఁగ
వెలయు మలికిభరాముఁ గొలిచిమనుచు । కలనఁ దన చెయ్యి మీఁదుగాఁ గడిమి మెఱసి
మేలుసిరులందు నట్టి యమీనుఖాన । యొడయఁ డొకనాఁడు నిండుపేరోలగమున.

మ. పొంకపుఁ జుట్టఱికపు రాయబారులు దొరల్ । పోడల్ చెలుల్ మన్నె వా
రలు మావంతులు దీవులేలు బలియుల్ రౌతుల్ మొదల్గాఁ బసుం
గొలువున్ సంతసమంది కబ్బములు పేర్కోలించు బల్పించు నా
న్నాలరంగాఁ దనదండనుండుచుకొని నెయ్యంబొప్ప మన్నించుచున్.

క. కలప్రషు చేసినగందం । బలఁదించిన వెనుక వన్నియలపచ్చడముల్
పల్లుమానికముల సొమ్ములు । బలు తేజీలిచ్చికూర్మి పై పైఁబర్వన్.

మ. తనకున్నిచ్చలు మ్రొక్కువారిని సిరుల్ దైవారఁగాఁజల్ల చూ
పున నెల్ల ప్పుడుఁజూచి మన్నఁగలపెన్ప్రోడన్ మరింగంటి యా
ప్పనగారిన్ మదిలోని మాటదెలియం బాటింపుచుంగాంచినన్
గనియామేటి తలంపెటింగి పొసఁగం గానన్ను మన్నింపుచున్.

ఆ. వె. పిలిచిపొన్నికంటి తెలగన్న నీచేయు । నచ్చతెనుఁగుఁగబ్బమన్నియెడల
మించివెలయుఁగా నమీనుఖానునకిచ్చి । పుడమిలోన సిరులఁబొగడుగనుము.

క. మున్నెవ్వడు నొడువనియా । తెన్నిడికడుమీఱియచ్చ తెనుఁగుం గబ్బం
బెన్నికమీఱఁగఁజెప్పిన । నిన్నుంబొగడంగఁగలఁడె నెలతాల్పయినన్.

ఉ. అచ్చతెనుంగుఁబద్దెమొకటైనను గబ్బములోన నుంచినన్
హెచ్చనియాడుచుందురది యెన్నుచు నేర్పునఁబొత్తమెల్ల ని
ట్లచ్చతెనుంగున న్నొడువ నంపులచందమెఱుంగువారు నన్
మెచ్చరొయబ్బురంబనరొ మేలనరో కొనియాడరో సినున్.

క. అనవుడుబళినా కబ్బం । బునకున్ దేఁజబ్బఁదావిపుత్త్రికిం గ
ల్గినరీవిననుచు మదిలో । ననుసంతసమందికూర్మి నన లెత్తంగన్.

క. తెనుఁగునను మాఱుపేళ్ళిడి । పెనఁచినవినఁగూడదనుచు బిరుసులుఁజేళ్ళన్
మును వేల్పుబాస వెంబడి । నని చెదఁగాదనకుఁ డయ్యయుల్లములందున్.

వ. అనిపలికిలాలసరి గజాంకుశుండును రాయపక్షిసాళ్వుండును సతకాసింహాస
నాధీశ్వరుండును సింగిణీసురత్రాణుండును దురగారోహణరేవంతుండును సింహ
తలాటరాయుండును నగు మలికిభరాము పాదుశాహునకు హితవరియై చదువు
లకుంగుదురై మన్ననలకెన్నికయై చెన్నొందునమీనుఖాన సింగంబువంగడంబు
నేర్పటించెదనదియెట్లనిన.

సీ. మున్నీటిరాణియా విన్నెతెయేవేల్పు నడుగుఁ గెందామరనలరుతేనె
బాసవాల్గముతెన్ను ప్రామిన్కులేవేల్పు చెలువంపుఁబావాలగిలుకరవలు
కడిఁదిరక్కసిమూఁక మెడచాల్పలేవేల్పు చేనున్నసూడివాలుచికిలికళుకుఁ
గమ్మఁదెమ్మెర పూపదిమ్ముదానేవేల్పు మంచుమించులపాను పంచదూ—
యతఁడుదానైన కర్తారుఁడలమికూర్మిఁ
బ్రోవసత్య చింతామణి పొట్ల చెఱువు

సంస్కృతాంధ్రపలుగసిరుల్ గ్రంథుకొనఁగఁ.
బుడమివెలసె హలుమామియాపుడమితేఁడు.

క. కలిమిన్ బలిమిని విడిముడిఁ । బలుకులపస నీపితీవి బంటుతనమునన్
వెలయుహుస్సుమామియ్యాఅం । పిలుసొంపుల జాడుబీబిఁబెండిలియయ్యెన్.

క. ఆమగువయందునతఁడు బ । డేమియ్యాఁగనియె సందడింపుచుసిరులెం
తో మెఱయఁగ వెన్నుఁడుసిరి । చానవలన మరునిఁగన్న చందముమీఱన్.

సీ. పూవింటివాఁడునేర్పున సోయగంబున వినువాఁక బిడ్డఁడు వింటికడిమిఁ
దామరచెలిచూలి తగునీగి నానచే రాముండు ప్రతినబీరంబునందుఁ
బుడమితాల్పరియొనల్కుడఁబల్కునేర్పున రాజుసొంపుననిబ్బరంపుఁదెలివి-
నేను మోములమేటి హెచ్చగుబలిమిచే రారాజుసొమ్ములరవణమునను
నెట్టివజ్జిర్లుసెన్నంగ నీడుగారు। కొమరుమీఱు హబుమామియా కొమరుఁదొగుచుఁ
బోలుపుగనినబడేమియాపుడమితేని। కహహా ము జ్జగములయందు నరసిచూడ.

తరల. హలుకులే జవరాలివేనలిఁ జాలసంద్రములోనియా
కలిమితొయ్యలిగేస్తునెమ్మొయి గాలి మేపుతేనిచూ
పులపెడంగును జాసవాల్కును పూపకంపుఁ దలంచుబా
గులయసంబు బడేమియాతనకున్ సతంబుగఁదాలిచెన్.

వ. అతండు.

క. కలిమిచెలివెన్నుఁడుం బలు । కులతేజవరాలు నాలుగుమొగముతఁడున్
బలెఁదగు సిలారుబీబిం । గొలమలరఁగఁ బెండ్లియయ్యెఁగూరిమిమిఱన్.

ఉ. చుట్టపుహారి రాసిరుల చూపులకోపులకైవులానిచే
పట్టియహంగుగానడపు ప్రాపగుకూరిమి నా బడేమియా
పట్టపురాణియై కలిమిఁబాటిలుచుండు సిలారుబీబి యా
ప్పుట్టువనాసిలంతకును బాటియెయెన్నఁగ గట్టుచూలియున్.

3. తే. ఆసిలారుబీబియందు బడేమియా । పుడమితేఁడుసిరులఁ బొందునట్టి
కడఁకతోనమీనుఖాను పేల్పులతేనిఁ । గనియెమదినిగూర్మిగడలుకొనఁగ.

క. అనువుగమతియానతఁడుసర । బనబీబింబెండ్లియాడె బలువేడుకతోఁ
గనియెందగునాయమయం । దును బాబనమియ్యా నీపితొవచెలికానిన్.

మ. కలనన్ బాబనుమియ్యా సింగముకడంకన్ మార్తురేనుంగుజం
గిలిఁజేకైనువనొంచి వానితలలంగీల్కొన్నముత్తెంబులే.

తలఁ ద్రెస్సాల్గా నని నేల పెండ్లప్పగు గాఁ దా సొంపుతో మీఱు చుణ్
గెలుపుం బైఁడి నెలంతఁ గైకొని యె సగ్గి పణ్ జగంబంతయుణ్.
సీ॥ పట్టంగ నీఁడు సంబళికలుకలనిలోఁ జేరవచ్చిన మార్తు చేతఁ గాని
పూనఁ నీఁడ దక్షంబు పొగరుతో బవరంబు సేయవచ్చిన వాని చేతఁ గాని
తేనీఁడు గొడుగు మత్తిల్లి యాలంబులోఁ జేఁబడ్డ మన్నీని చేతఁ గాని
తాల్పంగ నీఁడు కుందనపు ఝూరి ఉవ్వఁ జెనక వచ్చిన తే౧ చేతఁ గాని
యతనిఁ గొని యాడ నలవియే వైమతలల । వేల్పు రాయనికైనను వేయి తలల
ప్రౌఢ కేనియు నని చాలఁ బొగడ నెగడె । నిందు వేడ్క నమీను ఖానుండు ప్రథమి.
ఉ॥ మించియమీను ఖానుఁ డెలమిణ్ గలబట్లకు నెల్లనిచ్చెఁ బ
ట్టుంచుల పచ్చడాలు వరహాలు సరాలు గుఱాలు పల్లకీల్
కుంచెలయందలాలు గొడుగుల్ పడగల్ కడుతోరహాత్తుగా
సంచఁగ నెవ్వరీడతని కీగిపసణ్ బరికించిచూచినణ్.
సీ॥ పలపలనై ద్రమానుపడి పండ్లు చూపెడు ప్రదుకుఁ జెట్లను వేఁడఁ బోవ నేల
మించు చూపుచు నెనమ్మించి నిల్కడయేది విసమొసంగెడు మబ్బుఁ గోసర నేల
యొల్లి వోయియు లేక యొక పూఁట వెట్టెడు తామర చెలి పట్టిఁ దడవ నేల —
పొరలంగఁ బడుచుఁ దాఁ దొరమఱుంగున నుండి కసరెడు మన్నీటి దాసఁగ నేల ;
తెలివి గురికొల్పి నిచ్చలు పలుకుఁ దియ్యఁ
దనము గాన్పింప నొసఁగెడు దారి చేత
మిగులఁ బొలుపొందు నట్టి యమీనుఖాన
యొడయఁ డొప్పుల కుప్పయై యొనరుచుండ.
సీ॥ దరములో ద్రేఁటూఱుతునుకలు గా ద్రేయునట్టి రౌతుల కెల్ల నాటపట్టు
తొడరి జెబ్బులినైనఁ జెడ కేలఁ బడఁ ద్రోయుపూఁప గల్గిన బంట్ల పుట్టినిల్లు
నట్టి ద్రమాఁకుల నిగుడ్వోట్టెడు పాటలఁ బాటిల్లు గాణల పట్టుఁ గొమ్మ
పుట్టుఁ బుట్టిన ప్రౌఢపొల్పు నఁ జెప్పఁ గాఁ గలుగు జాణల మొత్తములకు నెలవు
నైన తన పేరఁ గల్గు నమీను పురము । నందు మున్నీటి జోకచేయంగ జాలు
చెలువు ద్రత్వించె మిగుల నచ్చెరువు గాఁగ । నిందు వేడ్క నమీను ఖానుండు మెఱసి.
ఉ॥ తామరతంపరై సిరులఁ దార్కొను కోసల నాటి సత్య చిం
తామణి పొట్లు చెర్లను సతంబగుచుండ నమీను ఖానుఁ డిం
పామతిలంగ నిల్పఁ బొడవై జెడఁగైన మసీదుఁ గాంచియం
దెమను కంఠికొండపయి కేగఁ దలంపక చేసికంటియుణ్.

ఉ. పొడవుల కెల్లఁ బొడవు ప్రోడలు నెమ్మదిలోనఁ గాంచు ని
ల్కడ కడలేని తేజ నజగంబున కవ్వలిదైన వెల్గు నె
య్యెడలను బొందువారలకు నెక్కఁగ నిచ్చిన యాత్మసీమ నిం
పడరఁగ మీను ఖానదయ యంతయు తిరంబుగ నిల్పెఁ బొల్పుగన్.

చ. కడకన మీను ఖానుఁడు జగంబు తనుం బొగడంగ వేడ్కతో 25/4/60
పడువక యెప్పుడున్ బుడమి వేల్పుల బిడ్డలఁ బెండ్లి చేయఁగాన్. 25.3.73.
నడరెడు బీదలోఁ బొడను నంగు కతంబునఁ గాదెదూరుఁ జే
రడవుల లోపలన్ దబిసి రైకను పట్టెడు గాలి చూలియున్.

ఉ. దొమ్మిన మీను ఖానుఁడెటఁ దూకొని గెల్పులఁ గొన్న సొమ్ములా
నిమ్ములలిబ్బులన్నవి యెన్నడ జక్కులఁ దేఁడు గాంచినా
తొమ్మిదిలిబ్బులున్ బలిమితోఁ గొనఁ జోయనుచుం దలంపులో
నమ్మక కాఁచియుండు జతనంబున రేలుఁ బగళ్లు నెంతయున్.

క. అబ్బురమై పాలుపొందెడు । కబ్బంబులు చాలనంది కనియెన సంబుల్
నిబ్బరముగఁ బొంకమెడు చే । రుబ్బున నల్గడల జాణలో హాయనఁగన్.

సీ. నారేళ్లు నేరేళ్లు మామిళ్లు జిన్నలు మాదీఫలంబులు మాదిమ్మ
లీచెలు మేడులు జీడులు దాడింబ లనటులు పనసలు చనుపకములు
పొగడలు పొన్నలు పోకఁ బ్రాఁకులు కమ్మరేకులు నిమ్మలు రేగులిప్ప
లంబాళములు కజ్జూరంబు లనాసలు నారికడంబులు నారదబ్బ
లగరు తేలకి విరవాది యాకుఁ దీఁగె । వల్లియలు గొజ్జఁగులు దాక మొల్ల మొగలి
మొదలుగా నివియెప్పుడుఁ బూచి కాచి । యుండు తోఁటల మీను ఖానుండు నిలిపె.

ఆ.గీ. ఏచిననిచి పూచి కాచి పండిన యమీ । న్వగము మేలి తోఁట లరసి కాంచు
ముసలివారికైనఁ బసిబిడ్డలకునైనఁ । బండ్లు వచ్చునలరుఁ బ్రాయ మొదవి.

క. చలిపందిరులును సత్రము । వులునూతులు బావులుం బువుందోఁటలుఁ జె
ర్వులు నల్లిండ్లును మొదలుగ । నిలిపియె మీర్ ఖానుఁడ సమునించెం బుడమిన్.

క. ఇట్టిగొనేటిబులచే నె । ప్పట్టున నెన్నంగఁ దగిన బలియుఁడ సొంపుల్
నెట్టుకొనఁ దనకుఁ దగియెడు । పట్టపురాణులను గూర్చి పైపైఁ బర్వన్.

క. గరితబడేబీబిన్ నె । క్కురబీబిన్ నెమ్మబీబిఁగను పట్టెడు రా
మురుఁడగు నమీను ఖానుఁడు । సిరులొదవఁగఁ బెండ్లియాడెఁ జెలువలరంగన్.

వ. వారియందు.

జాలిన్నవాఁడుసొంపులను జెందుచుఁ డెంచగ తానుఖానునిన్
బోలినవారుగల్గుదురె పుట్టినవారలఁ బుట్టువారలన్.

వ. అతనితమ్ముఁడు.

మ. అనిలోమార్కొనుమార్తురఁ దేండ్లఁ గడు నెయ్యంబొప్పఁగా వేల్పు స్త్రీ
ల్కనఁబోండ్ల గెలయంగఁ జేసి పరికానల్ గప్పులన్ వాఁక లే
యనుకుల్ గానానరించెఁగొండదటికి నోహో మేలు ఫాజీలు ఖా
నునకున్ సాటిపెలంప నెవ్వరికి నెంచన్ గ్రంధు గా నెన్నినన్.

చ. కనితనురాజులెన్నుకొనఁగాఁ బెనుపొఁజులతో సిరంగరా
యనికడకేగిమాటలనె యాయనఁ దేటెచి తెచ్చిమల్కకున్
మనుకువనంటు చేసి యొరిమంగ దు మెచ్చులుగొన్న మేటి నే
మని పొగడంగవచ్చునవునా నిఁక ఫాజిలుఖానరాయనిన్.

సీ. తగువేల్పుదొరరాణిమగమానికపుసొమ్ము నెగ తేనిచానగొజ్జఁగుబ్బబంతి
జవ్వు గేస్తురాలిమైనమరుకప్రపుఁబూఁత పొలదిండిరాతేని నెలఁతనగవు
నీటిరాయనికల్కి నిద్దంపుదువ్వల్వ తెమ్మెరకొమ్మచే తెల్లదమ్మి
ముక్కంటిచెలిలేము ముత్తెంపుఁజేర్చుక్క నెలతాల్పుపడఁతి పన్నీటిజల్లక
మగుచుఁ జెలువలగమి కాసిఁ దొగలతేనిఁ। గ్రిందమీఁద నడంచియేకందు లేక
యొఱమిఫాజీలుఖానునియసము లెపుడు। సకలజగములఁ బండువెన్నెలలుగాయు.

సీ. మదిలోఁగియలనిజామనమల్క పెట్టిన పల్లకీలోకవంకబాగుమీఱ
నుదిరియేదులఖానుఁడొసఁగిన పైగోవగుఱ్ఱముల్ బడివాఁగెగొల్చిరాఁగ
వేడుకతో నేడు మాడెలదొరలు కానుకలంపినట్టి యేనుఁగులు బెరయ
కన్నడరాయఁడు మన్నించియంపిన ముత్తెలపెట్టెలహాత్తి మెఱయ
వచ్చితెచ్చినసొమ్ములు మచ్చికలర। నిచ్చియిభరాముషాహుచే మెచ్చుగనిరొ
నట్టిఫాజీలుఖానరాయనికి సాటి। గలరె సేర్పరు లెల్లజగంబులందు.

వ. మఱియు నమీరుఖానుని కొండవదేవేరి యొట్టిదనిన.

గీ. కలికినిజవరునిజాణబిబ్బిగాదె కొండ। వన్నెవాసిగ మెలఁగెశి పిన్నపెద్ద
చుట్టముల పాలితంగెటిజున్ననంగఁ। బేర్మిఁ జెలువొందు సెక్కరబీబి యెపుడు.

క. ఒఱపరి సెక్కరబీబి। తెఱవంపు నమీనుఖాను దేవరగని యొకన్
నెఱజాణ్యబుద్ధిలల్లిని। మఱియును షేకిభరామమరుని బెరిమన్.

సీ. తనరూపువలయందుఁ దలిరాకుబోఁడులకనుఁదళ్కు బేడిసగములు దగులఁ
దనచాగమనుమబ్బు మొనవేఁడువారను చినుకుమేపుడుపుల్లులైనసిపాదలఁ

దనయేడుగుండమ్ములను రాచనెత్తెంపుఁబలుదిండి రాతుమ్మెదల్ మెలంగఁ
తనపరంజీచిల్వకును మార్తు రాతేండ్లయుసురు గాడుపు లింపులొసఁగు చంద్ర
నొసరు ఇభరాముపాదుశాహు జురునందు। బొందుగా వ్రాయనేర్చిన ప్రౌఢమైన
యబ్దులల్లికినీడెవ్వ గరసిచూడ । సహాహాగొనములనతనికి సతఁడెతగును.

క. అరబీపారసికన్నడ । మురుమీకన్నోజి తెనుఁగు మొదలగు బాసల్
పరికించి కుతుబుశాతలఁ । పరయుచుఁబొలుపొందు నబ్దులల్లీపుడమిన్ —

ఉ. కంటినివింటి నేర్పునను గావకకయ్యమునందు నొంచినన్
వింటికి నేగి వేలుపుల వీటను జూపుకటారికత్తెలౌ
దంటల గుబ్బచన్నుల తుదన్నెలకొందురు మార్తురౌర య
వ్వింటికి నబ్దులల్లిబలువిట్టికిఁ గీలదియేమిగల్గెనో.

క. అతనికిఁ గూరిమితమ్ముఁడు । సతముగ షేకిభరామచదురుఁడు పగరం
దతిఁగూడుశోకలరయని । ప్రతినలువట్టించి మలలవజ్జలకని చెన్.

మ. అరయన్ షేకిభరాము రానెలకుఁ బ్రాపైనట్టిలోఁగూర్మి చే
సిరియుంబల్కుల తమ్మికంటియుఁగదుం జేదోడు వాదోడునై
వరుసన్ ద్రిమ్మరుచుందురన్న మతికైవారంబుగా వింపఁగాఁ
దరమే యాయన చాగముం జనువులుం దా నొక్కముక్కంటికిన్.

వ. ఇంకనమీనుఖాను మూడవ జవేరియెట్టిదనిన.

క. వీడమతనచుట్టంబులఁ । జూడనుపెలవారి మగని చొప్పరయక మూ
టాడదుపలు వేల్పులఁగొని । యాడదహాహాసెమ్మె బీబి నలసియెపొగడన్.

క. తగునట్టిసెమ్మెబీబీ । మగువయును మీనుఖాన మగసింగముసొం
పుగఁగాంచిరబ్దులకరీ । ముగొనంబుల ప్రోకఁజాగములతో గితేసిన్.

సీ. మాటనేర్పునరాజు మదిఁగూర్మి నింపఁగా నలరించునెప్పుడబ్దులకరీము
వలతేఁ కైవడిఁదలిరాకుబోఁడుల వలపించుజాణఁడబ్దులకరీము
పారసియరబులేర్పడ వ్రాయఁజదువంగనలువ తలంపనబ్దులకరీము
అడుగువారలకు లేదనుమాట తనమదిఁదలఁపఁడెన్నఁడును నబ్దులకరీము
మించియిభరాముశాహు మెప్పించి మేలు
తగటుదట్టీల్కుళ్ళాయీలు పొగరుమిగులు
గుఱ్ఱములు నందలమ్ములు గొడుగుగాంచి
కలిమిపొగడొందెబుడమి నబ్దులకరీము.

చ. చనువ్వులప్రోడ నేరుపరి జాణలు మెచ్చఁగడంగి దాయలన్
గదిమియడంచి గెల్పు సిరిఁ గైకొనిమించిన మేటి యెప్పుడున్.
మదిఁదలఁచ వేలుపున్నిలిపి మల్కిభరాముశహాను గొల్చుఁ గూ.
ర్మిదయులువార నబ్బుల రీమునకున్ సరియెవ్వరిచ్చటన్.
వ. మఱియు మెఱయుసిరులకు నెలవై తమఫేరుండైన హాజరతి మోఖి సుంజిఖాదిరి
యడుగుందమ్ములు తలంపులో నెలకొల్పు గతౌతఖానుండును ఫాజీలుఖాన
యెుడయండును నబ్బులల్లీరాయండును నబ్బుకరీమును వీరలకుఁ గూరిమి తమ్ము
డైన తసీరునిహాజరతి శేఖుబుసురుదిఖాదిరిని మదిందలంచు శ్హేఖిభరాముండును
దనర్చిరి.
ఉ. ఇట్టిలో మాళ్లరాసిరులహెచ్చఁగ మించిన ప్రోడయెుకై
పట్టపుఠేండ్ల మొక్కఁగనిపాటిలు నాయిభొర్యారుశాహు చే
పట్టియనుంగు గానడు పఁదాయక మూడుతరాలనుండి క
న్పట్టునమీను ఖానుఁడు రపంబునమించె నసుంబుకల్మి చేన్.
షష్ఠ్యంతములు.
క. ఈగొనములఁ గడుమీఱుచుఁ । జాగపు మెఱవడిని వేల్పు జన్నియను నెలన్
వేగన్నులదొరప్రూఁకుల । చేగంగైకొనని యీగిచెలువపుశిబికిన్.
క. నిగనిగమను నెలకలుబలు । దెగలను వెలిపులుఁగుఁబదువుఁడెలి మొగిలు గమిన్
దొగలన్ వగలన్ జగులన్ । మిగులన్వడి నవ్వునసవుమిసుములగమికిన్.
క. తనవారిమనుప మార్తురఁ । బనిపంపఁ గొలంబు నిలుప బలిమినిబుడమిన్
తనరఁగమానిసితనమూ । నినకతివేల్పునకు రాచనెల తాల్పునకున్.
క. గమకమున నెదురుపగతురఁ । గొమరుంబాయములవేల్పు కొమ్మలఁగడుఁ జు
ట్టములఁగఁగూర్చెడు నేరుపు । సమకూతిన రాయపక్షి సాళ్వంబునకున్.
క. పలుతలఁపులఁబోలు పగుతన । తలవాకిట నెప్పుడుఁ బలుకుతలిరుంబోఁడిన్
బొలుపుగఁగాపురముంచిన । మెలఁకువగల నేరుపరి కమీన్ ఖానునకున్.
వ. సిరులుం గీడునవురు కొమరులుంగలిగి మనునట్లుగా నాయెునర్పం బూనిన
యబ్బురంబగు నిబ్బలు గబ్బంబునకుం బ్రావయగు ప్రోవయెట్టిదనిన.
సీ. తగఁగోటఁదాచిన మగతూనికంబుల తెలిరంగు లెప్పుడు వెన్నెలలు గాయ
మేడలపైనాడు మెలఁతలుఁదెఱగంటి కొమ్మలు నేప్రొద్దుఁ గూడితిరుగఁ
జిలువచావులగడ్త వలినీటిపైఁదేలి యొరిమతో ననయంబు నోలలాడ
మేలిమి బంగారు మేలిపచ్చలడాలు మిసిమి మింటికి నెల్లఁ బసిమి యెుసఁగ

జడలర్గొసిన కొమ్మ చాలుకతన । మీఁదరారాక యలప్రొద్దు మెఱుఁగుదేఱ
గివసులనె రాకపోకలుగా మెలంగఁ । దనరుఁ బుడమిఁ బ్రతిష్ఠానమనఁగ వీడు.

క. పొడవగు బంగరుమేడలఁ । గడువేడుక నాడుపడఁతుకల మొగములతోఁ
దడఁబడుచు నంచురేఖ । గడకడఁ జనుఁ జందురుండు గ్రందుమునవటన్.

చ. కనఁదగు తెల్లమానికపుఁ గప్పులనొప్పెడు చప్పరాలలోఁ
దనపొడవైన నీడగని తాళక యేనుఁగటంచుఁ గొమ్ములం
జెనకఁగవచ్చి కోటపయిఁ జేసిన ముత్తెపుసింగపుంగమిం
గనుఁగొని పాఱు వేల్పు కొరగొరతఁడొదల మస్తరిలవఁగన్.

మ. తళుకుల్ గుల్కెడునందు మేడలతుదన్ దాఁగొన్న బంగారు కుం
డలు మిన్నేటను గానిపించుచును విన్నాణంపుఁ దెల్వింగడున్
విలసిల్లం గని పైఁడితమ్ములనుచున్ వేల్పుం బువుంబోండ్లు చే
తులఁ దేరం జనఁజూచి నవ్వుదురు రంతుల్ గాఁగ జేజేదొరల్.

చ. దళమగనందుఁ గోటలతుదం దవిలించిన మించుపైఁడిబ్రాఁ
తలకటికెక్కుముల్ గనిరొదన్ మెఱుఁగుల్గల మబ్బులం మరం
చిలి తగనాడ నన్నెమలి పిండుఁగనంగొని చిన్కుమాటియ
ప్పలుఁగులు సంతసిల్లుఁ గడుపుల్ గటునిండఁగ సానుకోర్కులన్.

క. అగడితలోఁ గెందామర । మొగడలు గనుపట్టెఁ జాల మూఁకై చూడం
జగి మున్నీటం దేలుచు । జెగడని వార్వంపు టగ్గిపిల్లులవోలెన్.

సీ. మెఱసి పోకకసిల్చి మెలఁతపై యొఱప్పు చేఁదిలకించు క్రొమ్మించు తీవెలనఁగఁ
గప్పారుతోంగలి తెప్పలెల్లార్చ్చకన్నవల నొప్పెడు వేల్పుటువిదలనఁగఁ
గడుసోయగంబు చేఁబుడమిపై నటయాటఁ జాలుచు మేలిమిపైఁడిబొమ్మలనఁగ
సింగారమమరంగఁ జిలిచేసించిన వలరాచవాని పూమలనఁగ
నలువతాఁ జేయఁగలిగిన పొలుపుఁ గూర్చి । కరముఁ జేతులఁ బట్టినఁ గందఁ జొచ్చు
దలఁచెఁ గొమ్మలు గానన నలరు నట్టి । పుణ్యజనుద్దుదనర్తురా ప్రోలిలోన.

ఉ. ఇంచుకకేలవాగె గుదియించిన సంభ్రమ దాఁటుచున్ జవా
యించిన నేలగ్రక్కుదల నిట్టటు గావడిఁ ద్రొక్కుచున్ మవా
ళించిన గట్టుగట్టుక లెక్కకుమిక్కిలి దవ్వువాఱుచున్
మించిన వారువంబులట మీఱుచుఁ ద్రిమ్మరు నెన్నియేనియున్.

చ. ఎనిమిది తావులందొడరి యేపుగ నెప్పుడు నామజాతిఁగా
నెనయుచుఁ గెంపురేకలుపయిం బొలుపొందఁగ నందునేనుఁగుల్

సీ. విన్నరు తలఁగల్లు వేల్పునౌదల పువ్వు తలఁపనెవ్వని తాత తాతతండ్రి
కలువల చెలికాని గారాపుఁబట్టియై తనరారు నేతని తాతతాత
దీవులు పదునెన్మి దింటితో నేలయంతయు నేలె నేతని తాతతండ్రి
తనయాననుడిగట్టు పెను కఁబర్వఁగఁజాలఁ దేజనమించె నేరాజు తాత
చేరి జేజేలు మటిఁబడ దారిగములు
నచ్చరలుఁగొల్వ వేగన్నులతని మొదలి
రాచనెలవేలెఁజేర్చి నేరాజతండ్రి
యతఁడుఁగోనియాడనెగడె యయాతి పుడమి.
సీ. తనవాలు మొక్కఁటికేని మార్తురగు రాచగములెల్లఁబూవిలుకాండ్రుగాఁగఁ
దనరూపువలకుఁ బైదలుల నెమ్మదులెల్ల వేలైన జేడిసమీలు గాఁగఁ
దనయీగి తొగతేనికిని వేఁడువారెల్లఁ దులకించు కల్వల తుటుములుగాఁగఁ
దన గెల్పు పట్లఁ బ్రాఁతలకు మున్నీటి యవ్వలమున్న సుడిగట్టు పలుకగాఁగఁ
దనదు తేజు జగంబనఁదగినతమ్మి। కొలఁకునకుఁ గోర్కు లిడు వేఁడి వెలుఁగు గాఁగఁ
గడలిలోఁగొనఁగల్గిన పుడమియెల్ల । నానకును లోనుగా నేలె నయ్యయాతి.
చ. అనికి నెదుర్పఁజాలు దొరనారసి కానక యయ్యయాతి దాఁ
జెనఁకువ మేటి జన్నములు పెక్కులు చేసి పసిండిఁ బాములం
దనుపఁగ దానినిచ్చునని దయ్యపుమూఁకలు పైఁడికొండపై
ననయముఁ గాపురంబులుగ నన్నియుఁ గాచుచు నుండు నెంతయున్.
చ. తోఁటలు లేని త్రోవలును దొరపు జన్నపుఁ గంబముల్ గడున్
నాఁటనియేటి పెన్దరులు నా డెప్పుఁ బాములకీనియాళ్ళు నీ
రాఁటని గాటపుం జెఱువు లారయ నబ్బుర మెంచి చూడన
మ్మేటియయాతియేలు పుడమిం దగునబ్బలియుం దలంపఁగన్,
సీ. తలఁపఁడు జేజేలు పొలసుదిండ్లనుగొండఁ గలఁచిన నాఁటి యంకిలియొకింత
యొఱుఁగఁడు తనలోన నేప్రొద్దుఁ బాయక యేర్చు వార్వపుటగ్గి యొగ్గు మదిని
మఱచెఁ జాల్పేరింటి మగువ నేలినవేల్పు విలుకు వేఁడిమి నింకఁ గలఁగఁబడుట
యొఱుఁగఁడు మత్తిల్లి పరఁటి పుట్టువుగ్రుక్క గొనిన్నయప్పుడు గలకతిలపాటు
నయ్యయాతి గడంగి నెయ్యమునఁ బుడమి
వేల్పులకుఁ బైఁడి యొసఁగెడు విడుపునీట
నిండి కొదవేమియును లేక యుండెఁ గడలి
యతని చాగంబు లింకనెన్న నలవియగునె.

క. ఆనాఁడు వేల్పు రాయఁడు । వేరపుఁ బేరెంటునైన వినఁబడకుండం
దోరము గఁజిల్వతేనికి । నూరటగాఁ బుడమిఁ దాల్చి యొకనాఁడాతన్.

సీ. పదియాఱువన్నెల పసిఁడిగోడల చెంతఁ దిరమైన కస్తురి తీనియలును
పాపమేపరిచ్చ పలకలఁ జెంగల్వ దోరతాలఁ దీర్చిన మాలములును
మగమానికంబుల తెగలబోదెలచేఁత పగడంపు గొప్పకంబములగములు
పెద్దతామర కెంపు బిగిపట్టియలచేత సొబగైన ముత్యాల సోరణములు.
వాసియేనుంగు కొమ్ములఁ జేసినట్టి
బోరుతలుపులచేతఁ గప్పురపుఁబనుల
మొరగులును మించుకొలువునుప్పరిగెలోనఁ
బరఁగుగొజ్జగిచల్వచప్పరమునందు.

సీ. అలవేల్పు దొరపంపినట్టి తలంపురా పనియడ్డపంబొక్క పడఁతిదాల్పఁ
జెలిమితోఁ దామర చెలిపట్టియునిచిన బలునరంజీ యొక్క చెలువపూనఁ
గలఁగి గాడుపుఱేఁడు కానుకంపిన వెల్ల వీచోపు బిడ్డలు వెలఁదులిడఁగఁ
బైఁడిరాయఁడుకూర్మిఁ బనిచిన నెత్తమ్మి కెంపుగిండి యొకర్తు కేలనలమ
వెఁడియును నేలచెలఁగులవుండు రాజు । లరికినిచ్చిన కన్నియలపఁకువలను
గదిసి కట్టడయగు నూడిగములు సేయఁ । బచ్చసింగంపు గద్దియపైఁ జెలంగె.

క. మానికపు సొమ్ము రంగులు । పూనికఁ జనదైన మేని పొలుపునకుఁ గడుం
మానసియారతులయితగఁ । దానాకమరుఁడనఁగ నొఱపుఁ దనముఁ నొఱపై.

సీ. ఆహోపరాకు విదేహునికానుకే సొబగైనయట్టి కస్తురి మెకంబు
లెచ్చరికయ్య మాహిష్మతియేలువాఁ డనిచినాఁడీ చిన్నయలుఁగుబోండ్ల.
నవధారు కుంతలుం డంపినవీయాము పొగరుచే మీఱు సేన్నగులగముల
చిత్తగింపుము స్వామి సింధురాజంపెను వడిమీఱు నీమేటి వారువముల
ననుచుఁ బేర్కొనికటికవాండ్రగ్గలంపు । రవళిగాఁ జూపి తెలుపఁగాఁ దవిలి పొని
నల్లనల్లనఁ గనుఁగొంచు నల్లసిల్లి । యపుడు పేరోలగంబుండె నయ్యయాతి.

వ. అంత.

సీ. గుఱివెంద పట్టెల్ల కనుదోయి సందిళ్లఁ బీలిదండలు గూర్చి చాలఁ దొడిఁగి
యొడ నాడపికిలి పూలిడిన సంకుల పేర్లు కోరెంద పూసలఁ గూడఁ దాల్చి
గుఱుతుగా మెఱయు జేగురుపొట్లమీఁదఁ దంగేటిపూఁబారలు రాగిల్లఁ దాల్చి
బలుపైన పాలుటాకులఁ బొట్టు దట్టిపై దిండుగాఁ దీగెల పిండుసుట్టి
కుఱుచచేతులు మిడిగ్రుడ్లు కఱకుమీస

బిరుతిగ్రమ్మైదు మేనులు నెఱుకుబోర
తేఁటమాటలు జగన్నపీఁచుగురులుఁ
గలుగు నెఱుకులు దగఁ జూడగనఁగవచ్చి.

గీ. ఓకిలిపూలుబూతపిల్లు లేనికకొమ్ము । లలరుఁజేపపెద్ద వెలగపండ్లు
వెదురుఁబ్రాలుతాటివదనికల్ గసగసాల్ । జల్లి మెకపుఁజాలుఁ జాఱపప్పు.

వ. పులికూనల్ సవరాలు కస్తురిమెకంబుల్ లేళ్ళు కుందేళ్ళు పం
దులు కాకోళ్ళు తెలు గుర్రేడులును మన్నుంబిళ్ళు సివ్వంగిపి
ల్లలు మొత్తంబు జవాదిపిల్లులు మొదల్గాఁగానలో వానిగుం
పులఁగై కానుకచేసి యాదలల మోడ్పుంజేతులం గూర్చుచున్.

వ. వాగిమ్రొక్కి లేచి యిట్లనిరి.

సీ. కొండమల్లయ్యచే నుండునంతరుగాని జంకను గాన మేసంకనైన
నాకటియాజమునకు నున్నదందురుగాని కాతెనుపోతును గాన మెచట
నలకంబమయ్య దానైన దేమోకాని సింగమొక్కటియైన సెలలలేదు
గాలిదేవరకును గలదటందురుగాని యుట్టినొక్కటిఁజూచి యెఱుగ మెందు
పాలిసెలేటమీరు వేఁటాడుకతన । నిప్పుడేఁడాధిరోల్ సామి యేఁగుదేమి
నేలయానిన తెలుఁగున నోలి నెపుడు । కడిమి నెడయాక తిరుగు మెకంబులడవి

గీ. చెలుఁబోళ్ళు చటీళ్ళును జేసి చొచ్చి । పయిరుపచ్చలు మేసియప్పాటఁబోక
పల్లియలుఁజొచ్చి తోఁటలు పాడుచేసి । కావగంబునఁ గముపులై గాసిచేయు

క. ఏటికిఁ జెప్పఁగ సామీ । మీటినఁ జటురాలు కానట్టి మెగములు మిగులన్
గాటములైనయమ్ములు । నాటక తియగాదుఁ బాలములన్నియుఁ బాసై.

వ. అన్నివిన్నపంబుల చెంచులవిన్నపం బాలించి సంతసంబున వారికినుడుగరలిచ్చి
నేఁడు వేఁటయని వీటంజాటఁ బడవాళ్లంబంచి పేరోలగంబువిచ్చి కొలు
వారల ననిచి నసుచు సంతసంబునఁ దన నగరికింజని తగుపనులు దీర్చి వేఁట
సంగగు సింగారంబునంబూంగి చేతులు పొడవల్లు గాఁగలుగు సిద్దంబుల
వాయిదంబుల పెక్కరవలి దవిలి నేలచెఱంగుల యేనుంగుల చెవులకుం జెం
గోలువఁ బ్రోఁజులునడువం బుడమిం బొడమునంటమ్ముగ్రమ్ము చిమ్ముచీఁకట్ల న
డంబుల బెడిదంపుఁ జాయలు విరియింప నొక్క వారువంబు నెక్కి వెడలెనప్పు
డు వేఁటకాండ్రు నాయితంబై.

గీ. లేటివలలును మేటిఁకుందేటివలలు । నెలుకవలలును నవదండ వలలు దొడ్డ
పులులఁ బందిటి వలలును బలువుమకిలవలలు మొదలుగఁ గలిగినవలలు మట్టి

క. ఉద్దవిడిఁ గవియుకుక్కలు । గద్దఱిసివ్వంగులిర్లుఁ గడునేచిన శ్యే
లెద్దులు మొదలుగ వేఁటకు । దిద్దినయవి ప్రోఁగుఁ దాళ్ళఁ దిరచీరగ మేల్.

క. బలుసైన వేసడంబులు । జలకట్టెలు నోరణములు సాళ్వంబులు గి
ద్దులు మొదలుగఁ గల విడివేఁ । టలపులుఁగులు పదనుతో మిటారింపంగన్.

గీ. కాలుకోడి కాఁజు కక్కెరపూరేడు । కేరజములు మఱియుఁ జేరుగలుగు
చింద మొదలు గాఁగఁ బొంది వేఁటకుమీఁలు । పిట్టలెల్ల గూళ్ళ బెట్టు చెలఁగ.

క. మరితెరలుఁ జిక్కు మేలువం । కరబోనులు త్రాళ్ళు నురులు కాలురులు నుజే
గురు గండెలు తలముళ్ళున్ । గరిపిలుకులు విండ్లులోను గాఁ గొంచు వెసన్.

వ. వేఁటకాండ్రు గొలిచినదువ సంతసంబునఁ గొంతదవ్వరి కేయంతటబలు మూఁ
కలమెకంబుల నిలువున్నట్లుగా నేమించి వేఁటకుండగిన పోఁజులతోఁ జనియుండట.

సీ. నింగిచీటలు వాఱఁ బొంగుసింగంబులరవలిచే దెసలెల్లఁ జెవుడు పడఁగ
పోలసు దొబ్బలనుబ్బు పులుల పెన్ బొబ్బలఁ గజలియు బలు మాఱులుఁ గలఁకి పోరల
పీల్క నేనిక మూఁక విఱుచు మ్రాఁ ల మ్రోఁత పెటపెటల్ మలల నిట్టటుగఁ జేయ
మీఱు చనేట్లాడు కాఱుపోతుల కొమ్ము చప్పుళ్ళఁ బులుఁగులు కుప్పగూల
గోరగోరంజను పందుల ఘుర్ఘురంబు
జెడిదములఁ బుడమియు వడవడ వడంక
నెప్పుడు నైదయీని చీఁకట్ల నివము గొనుచు
వాంటిఁ జొరరానియట్లుగా నుండె మఱియు.

గీ. ప్రాణ్యుబాయులు దూఱకపాళ్ళు చేసి । యిసుము చల్లిన రాలక యిఱులుగ్రమ్మి
నడవఁగా రాని యొక్క కారడవి నవుడు । కాంచి వెఱఁగందె నా రాచకలువ ఱేఁడు.

వ. ఇట్లు కాంచి వెఱఁగందు డెందంబున నయ్యడవిం గొంతదవ్వరిగి యుండట.

సీ. అలరుకస్తూరినై ఒలికి వాకిళ్ళ చెంతల వైచి పోయిన తట్టుపునుఁగు
గోడలు పూయఁగఁ గ్రుమ్మి గందంబున మేదించిన ట్టిజవ్వాది యదుసు
నాడాడ సరిచేసు లాడి పోవిడిచిన దుదురు పెదుళ్ళలో ముత్తియములు
బలుపు టేనిక కొమ్ము టులవల పైఁ ద్రోవఁ దవిలించి కట్టిన సవరములును
వంటకట్టెలకని తెచ్చి వాయులిడిన
యగరు మ్రాఁకుల పైఁ బండ నాఱఁబెట్టు
కప్పురంపు టునంటులు గలిగి మెఱయు
నెఱుకుపల్లియలొకకొన్ని యెదుటఁ గాంచి.

సీ. చెవులకీతెల్లయుచ్చితకాయలెం తేసి పాఱటాకులది కుప్పసమిదప్ప
లయ్యకుఁగిట్టనెం తరటాకుఁ గట్టిరా యీపచ్చతాడిబిళ్లీఁదాకొ
వెళ్లఁజుట్టినపెట్టి వేళ్లోళ్లో చేతులఁ బండుదీఁగెలవి గొప్పలుకడేలు
తలకువేసీఁకలో తాల్చిరియీలాగు నీయచ్చగురిజపే రెండుఁగలిగె
రాజు గాఁడన్నకంబము రాయఁడితని
వేసమును మేలు బాగెము సేసియుంట
నిపుడు గనుఁగొంటి మనిపల్కు నెఱుకదొరల
ముగుదమాటలు విని చాలనగుచు నలరి.

వ. చనుచున్నెడ నిచ్చోటు వేఁటకు వాటంబని వేఁటకాండ్రు విన్నవించు మాట
లాలించి వేఁట వేట్టుమని పుడమితేఁడానతిచ్చిన.

చ. దురములవారు వంపుగమి త్రొక్కఁగ లేచిన దుమ్ము గ్రమ్మినన్
బురుదయియుండు నాకడలిఁ బూనిక నేనిక ముంకరేసివే
మరుబుసకొట్టఁగా నొగయ మవ్వపుఁ డుంపు రనీటిచేత రా
సిరిపయిఁ గూరిమిన్ మగుడఁ జెల్వుగ నించిన యాభగీరథా.

క. తెల్లిపిల్ బుడమిన్ దగుర | ల్వాలరాయా మైదనర్భువలరాయ కడన్
గలనైనఁ నీఁగెలుఁగక | కలనైన న్నెఱయ పెంపుగల ముక్కంటీ.

మత్తకోకిల. పోరులం దెగినీను మాద్రుత ప్రొద్దునెన్నడు మొక్కటన్
జేబిబల్విడి దూటిబంగరు చేలయున్ సిరితోడిసిం
గారమున్ సుడివాలు చిందము గల్గి సొంపులమీఱుచున్
రారు వేలుపుఁ జానలిండ్లకు రాసిరిందగు నేర్పరీ.

గద్య. ఇది శ్రీమదన గోపాల మంత్ర ప్రసాద లబ్ధసారస్వత సుకవిజనవర్ణనీయ వచో
విభవభావనామాత్యతనూభవ పొన్నికంటి వంశవర్య తెలగనార్య ప్రణీతం
బైన యయాతిచరిత్రంబను నచ్చ తెనుఁగు కబ్బంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

## ద్వితీయాశ్వాసము.

---

క. సిరివంటి బడేబీబీ | విరిబోఁడికి వెన్నుఁడనఁగ వెలయుచుమిగులన్
గరకరికలఁ దనరెడుశా | సిరులందు నమీనుఖాను చెలువములగమీ.

వ. అట మీఁది తెలుఁగు వినుండు.

యెదరకు ముష్టిఁ బొడిచియంటఁగఁ బట్టుచుఁ గోఱఁగొట్టినన్
మెడలఁగనీక తెచ్చినను మెచ్చులొసంగెను రాజువానికిన్.

సీ. వేల్పుమన్నీనికై వెలిచిపెన్బొదలలో నాడుగుకాటుకకొండ సోదమునఁగఁ
బ్రొద్దునకైలోఁగిపోయి సందులడాఁగి బెదరివెడలుకొర్ల పిల్లలనఁగ
నచవెల్లఁ దమచాయనంటినట్లుగనుండఁ దిరుగులాడెడి నీడిదిన్నెలనఁగ
నడవిమున్నీరంచు నరుదెంచిపోలేక పూని గ్రీష్మఋతువమ్బు కూనలనఁగఁ
దాఁగుబ్బలిదెస యేలుదేవరలిగి
పుడమిఁజూపిన తనబంట్ల ప్రాపలనఁగఁ
జూడమేనులు గరువాల్చు చొప్పగలుగు
నెలుఁగులనుజూచి మదినుబ్బి నెలుకుదెదిరి.

క. వడినాక్రోయెలుఁగు చెంచులఁ । గడచితనుఁ బొడువవచ్చు గద్దతియెలుగన్
మెడవట్టికొన్నఁగ్రిందను । బడిముష్టిఁజినతఁడు బోరఁబగిలిచినాంచెన్.

క. దాఁగనివచ్చి పైఁబడు । వానినిబల్లెముఁ గొంగవాఁడల సురెలన్
మైనులువ్రాలిచి పెంపున । తేఁకిసంతసము చేసి తేసిరికడఁకన్.

వ. అప్పుడొకకొండఁడు.

ఉ. చెంగటఁబాఱుతెల్లఁగని చేతులసన్నలనెల్లనిప్పి సి
వ్వంగులబండ్లుడించి తగవానికిఁ గన్నులుఁగుల్ దెరల్చియా
ముంగఁబాఱఁజూపుటయు మున్నగనాయుచుఁబోయి చేరవన్
జంగునదాఁటిపైకుఱికి చంపికలంచెను వానినప్పుటిన్.

గీ. పెంపుటిట్టులు కినుకలు పెనఁపోయి । కొన్నునుప్పుఁదగిలించు కొన్నసరగి
రాజుచూడ్కంగఁజెప్పంగరానికడిమి । నీటిముఁగ్రుమ్మినొంచిరి లేటిమగల.

క. ఎద్దులుమఱుఁగులుగాఁజని । గద్దులులై చేరువెన్ మెకంబులనాలో
నుద్దవిడినొంచరలవున । నద్దిరయనియయ్యయాతియబ్బురపడఁగన్.

క. మిడిబోనులఁగాలుచ్చులఁ । బడఁదోఁయుఁబోఁగుల్లోను పఱచియు తేళ్లన్
వడిగలజింకలనెల్లన్ । బొడిచిరి కడుఁజెంచులాఱుప్రలఁ జదిపెదరన్.

వ. అప్పుడు.

గీ. పాదివేఁటమూఁకఁబదరెడు రాతేని । మదియెఱింగి తడవుమనిన వెలిచె
కాఁజుకారుకోడి కక్కెరపూరేడు । చిందలున్నగూళ్ళ చేరఁదెచ్చి.

క. ఎడఁగలుగఁజెట్టి తలుపుల్ । విడనప గావించురవలిపినిచనిగూళ్లన్
బడుపులుఁగుల ననుటులతోఁ । గడునేడుకఁదెచ్చి యొకఁడు కానుకచేసెన్.

గీ. అప్పుడు౯డి వేఁట యిడుమని యానతిచ్చె । రాజు ముంగలికడకుఁ జేరంగవచ్చి
లగుడహస్తాళ్ళుఁ బుడేగలోనుగను గల్గు । వేఁటపుల్గుల విడిచిన వింటికెగసి.

సీ. కొక్కెరపూరేడు గోరువంకలావుక పొన్నంగి కోవెలకన్నెలేడి
జెళగువ్వ చాతులావిల మాసతప్పడు గాఁడు సెలవిపాలకాకి చిలుక
జలితపువెలివె పావళము తీతువు చింద కక్కెరయొక్కింత కారుకోడి
కాఁజు బెగ్గురు నీరుకాకి కంకణముసు కొంగ దాబయుగువ్వ వంగపండు
మొదలుగాఁ గల్గు వానిని మెదలనీక । కదిసి నున్గోళ్ళకొనలను గుదిచిపట్టి
పొదలుచును తేని మదికీనిం పొడవఁజేసె । నెలమినప్పుడు విడి వేఁటపులుఁగు వెల్లి.

గీ. అ తనారావ వేలుప్రహాళి యెటేఁగి । కడిమితోడుత నవ్వేఁట కాంక్ష మగడఁగి
పొడవు లైయుండు తెర లెత్తి పోఁగుదీర్చి । బలుమెకంబుల పలలందుఁ బడఁగ నార్చి.

క. పిడుగులచప్పుడు వడువునఁ । గడురొప్పు మెకపు గద్దికల కల్లుకకయే
కడల వెడఁలంగ వేయక । పొడువఁగ నారవలి నింగి పోరుకలంగెన్..

శా. రాజ తన్‌బలుపైన వేఁటతమిచే రాగిల్లి కెంగేలిపై
నేజా త్రిప్పుచు లాగివాగెబలిమిన్ దేయంచు నొక్కుమ్మడిన్
తేజీదోలిన ముందువెన్కఁ రుగ కెం తేబితలోఁ గ్రుంగి తా
మేజాడ జరఁగా నెలుంగకొదిగెన్ హెచ్చైమెకంబుల్ వెసన్.

వ. ఇట్లుగాలింగేలిగొను నురువడి మెఱవడి గారవపు వారువంబు నడలించి
తెరలోనకిం గదలించి.

క. పొడిచిన నేజావెంటనె । వడిఁ బైకొని చౌకళించి వచ్చినపులులన్
మెడలెసలించెను బెడిదపు । టడిదంబున నేల గప్పినట్టుగనుండన్.

క. ఆపగిది వ్రేసియుడుగక । యేపున సింగిణికి నారి యెక్కించి వడిన్
గోపుల బెబ్బులులంగని । తూప్రలసన్నాని నొక్కు దొనలుగఁ జేసెన్.

మహాస్రగ్ధర. అనుకుం జూపుల్ దగన్ దామదుగులు పుడమిన్ హత్తనీకేగు తేళ్ళన్
గని తేజీఁ దోలియంటం గదుముచు మెఱుఁగుల్ గ్రమ్ముచుండంగమున్నె
సిసితూపుల్ వెడియొంటం జెలఁగు చుఁదునుకల్ చేసిచే నేర్పు మీఱన్
దనవాలుం గటికన్నుల్ దలఁపుచు మదిలో డాఁచియున్నట్టి కూర్మిన్.

స్రగ్ధర. తుండింపన్ మన్నుబిళ్ళన్ దునిమెఁగ ణుసులన్ త్రుంచెఁ జివ్వంగి మూఁకన్
జెండాడెం గొండగొల్లన్ సెలగినెలుఁగులన్ జించెఁ గారోపుతులన్ మై-
కండల్గాఁజేసె నిల్లన్ గలఁచెఁ జిఱుతలన్ గండ్రికల్ చేసి నేలన్
నిండించెన్ దుప్పలం బన్నిదమునఁ గోకటిన్ లేకయుండంగనచ్చోన్.

దపమ్ముగావించు జాబాలి దండకరిగి
ముందటికి నేగి సాఁగిలి మ్రొక్కుటయును.

వ. అప్పుడా చప్పుడాలించి.

గీ. అల్లనల్లన కనువిచ్చి యతని పేరి | సోయగంబును బీరంబు చొప్పును రువు
తడవుగాఁ జూచి మదిని సంతసము గ్రమ్మ | నపుడు జడదారి రాయఁడిట్లను చుఁబలికె.

క. అన్నా నీ పేరెవ్వరు | నిన్నింగనుఁ గొన్న నహుషునింజూచినయ
ట్లున్నదియారా వేలుపు | గన్నకొమారుఁడవె నీవుకైవడిఁదోఁచెన్.

చ. అనవిని రాచవేల్పుదొర యాయనఁ గన్గొని కూర్మి నెమ్మదిం
జెనఁగొన నయ్య నే నహుషుబిడ్డఁడఁ బేరు యయాతి వేఁటకో
వున సవరించినన్ బెరలు బోనలుఁ గైకొనకొక్కయిట్టివ
చ్చినఁ జనుదెంచినాఁడ నదిచేపడునోయను హాళితోడుతన్.

వ. అనవుడుఁ జేరువందనరియెడఁ బుడమితేనిం గూర్చుండ నేమించి గారవించి యిట్లనియె.

క. రక్కసులు వేదఁబంబుల | మిక్కిలి నా మునికోనికొట్టుమిట్టాడంగా
నెక్కటి యొక మెకమ్మునకై | యిక్కావల నొంటిఁ దిరుగుటిది తగవగునే.

క. మునుపొక రక్కసి మెకమై | తనముందటి కేగుదేర దాని వెనుకఁ బాఁ
జను దెంచి కాదె రాముఁడు | నను వేదుచు మోసపోయి యలజడి పడియెన్.

ఉ. నావుడు నయ్యయాతి మదినాఁటిన ప్రేముడి ముజ్జగంబులన్
బ్రోవఁగఁ గావ బీరమునఁ బొల్పగు రాముఁడు నట్టి బూమెచే
నేవగ మోసపోయె నతఁడేమిటఁ దాఁ గడతేరెనో కనో
దేవర యానతీవలయుఁ జేటపడన్ విన వేడుకయ్యెడున్.

వ. అని యడుగుటయును.

చ. అలరఁ బులస్త్యు మద్దు కొడుకైతగు విశ్రవసుండు రావణుం
జెలువగు కుంభకర్ణుని విభీషణుఁ గాంచిన వారమీటి చే
బలువున నెల్లెడల్ గెలిచి పైఁడిదొరం దెగిపాఱఁదోలి ని
చ్చలమునఁ దానిగట్టుకడ సంద్రములో పలిదీవి యేలుచున్.

క. ఎనలేని కడిమి పెంపున | ననిమీఱిన యింద్రజిత్తు నతికాయుని న
త్తునిఁ ద్రిశిరుఁ గాంచె రావణుఁ | డనయంబును జగము లెల్ల నలజడిఁ జెందన్.

శా. ఇట్లట్లెంచను బోవరాక వగతో నెల్లప్పుడున్ వేలుపుల్
వెట్టింగొట్టము సేయ మత్తిలివడిన్ విన్నటితొల్పున్న యా

గట్టు బిట్టు పెకల్చి రావణుఁడనంగా మీఱి రాకాసి పెన్
బిట్టుం జేసె నతండు తమ్ము గవయుచ్ప్పట్లన్ దనుం గొల్వఁగన్.

వ. ఇట్లిందును నెదురులేక యతండు లెక్కకు మిక్కిలియగు రక్కసిమూఁకల
ప్రేఁకంబులతో జగంబులు వగలం బొగల నెట్టికొని కుతిలపెట్టుచునాక్కనాఁడు.

క. అలవాకయుబలెజేజే । నెలవుపయిన్ దాడివెట్టు నిగఁదన బంట్లన్
బిలిపించి సొంపు పెంపునఁ । జెలఁగుచుఁ బయనంపుఁ దముకుఁ జేయించుటయున్.

శా. రాలెం జుక్కలు గుబ్బలుల్ వగిలె సంద్రంబుల్ గలంగెన్ వడిన్
నేలం గుమ్మరిపోరిపో రెక్కఁడిరి గన్ ప్రీలెన్ దెసల్ బీతుచేఁ
దూలెన్ వేలుపు లెంకి పాఁపనెలవున్ దోడ్తోన్ వెతన్ బొందె వే
జాలిం జెందిరి జేసికంటి దొరయున్ సైరించ శావెన్నుఁడున్.

వ. ఇట్లు తముకు సేయించి కడిమి రక్కసుల పెక్కువల బెడిదంపు నడకంబు డమి గ్రక్కఁ
దలఁగదలిచని వెండికొండ కెలంకుల మొనలు విడియించె నప్పుడు.

గీ. సరగ మిన్నను కమ్మరి సంజకొలిమి । బెట్టుగాఁ గాల్చి బంగారు చుట్టువాలు
పదను వెట్టఁగఁ గొనిపోయి పట్టు లేక । విడిచె ననఁ బ్రొద్దు పడమటి కడలి మున్గె.

క. కడకడలి వేఁడి వెలుఁగను । జడవారి వడిన్ మునుంగఁ జని జేగురుప
చ్చడమూఱంగ ట్టెదరినఁ । బడమట నెఱసంజ నిండె బలుపుగ మఱియున్.

సీ. పూనికఁ దగు పీటి తేఁప సిండియుప్పరిగ వాకిటి తోఁపు తెరయనంగఁ
గుంకుమెట్టిన వేల్పుఁ గొమ్మలాడుచుఁ జల్లఁ దులకించు చెంద్రపు దుమ్మనంగఁ
గడుసొంపుచేనొప్పు పడమటి మలమీఁది చలులందుఁ గెంపుల చాయలనఁగఁ
దమినాడు తెఱగంటి కొమరులు గావింపఁ బోలు పొంజుపగడఁపుబలుకయనఁగఁ
బ్రొద్దువాసినవంతలోఁ బొడముచుండు । మఱుఁగు కెందమ్మి రేకుల మూకయనఁగ
విరియు చెంగొవనన లకు వెన్నపెట్టి । నిండె నెఱసంజ కన్నుల పండువగుచు.

వ. అప్పుడు.

సీ. నింగి పేరింటి మున్నీటిలో నప్పుడ పొడమిన బెడిదంపు బుగ్గలనఁగ
నాకసంబను ప్రమానియందునాక్కమ్మ డిఁ బూచిన తెల్లిచాయ పువ్వులనఁగ
మిన్ను నుకొల్లనిలో మెఱుఁగెక్కి విఱియుచు జిగినుల్లసిల్లెడు తొగలనంగఁ
జదలనునల్లపచ్చడము పైఁ బచరింపఁ దిలకించు నాణిముత్తెములనఁగఁ
గదిసి వలరాచ మేపుడుఁ గంటి వెల్పు । జడలలోనుండి వడియుచుఁ గడితఁ బడిన
తేటవేలుపుటేటి పెన్నీటి బొట్టు । లనఁగఁ జుక్కలు గనుపట్టె నలుఁదెలివి.

చ. తలఁపఁగ ననుంగులైన యలతమ్ములలోపల దాఁగెఁ గాక తా
వెలికెట కేఁగఁగాఁగలఁడు వేఁడిమి వెలుఁగని పేర్చి యార్చుచున్
నెలుఁగులఁ బెట్టఁగా వెదకు చీఁకటి సోఁకకుము పిల్లలో యనన్
గొలఁకులఁ ద్రిమ్మరం దాడఁగెఁ గూర్కుఁ గ్రమ్మాయుచు గండుఁదుమ్మెదల్.

క. తమ్ములు ముగిడించినఁ దమ | కొమ్మలలోఁ జిక్కి నిక్కి కూరిమిఁ జుట్టున్
ద్రిమ్మరు మగతుమ్మెదలౌ | నెమ్మది వగగాకయున్నె నెలఁతలఁ బాయన్.

క. ఇరులు బలియుచు నవలఁకుల్ | కరమరుదై కరుసు కట్టి కదిసిన కరణిన్
బరఁగఁగఁ దోఁచుడుఁ గాటుక | కరవటముం బోలె నిజ్జగంబు దనర్చెన్.

గీ. పూని పదిరెండు ప్రొద్దులుఁ బొడిచె నేని | యింతలోఁ గానవచ్చునె యించుకైన
ననఁగఁ గలిగిన వన్నియ లలమి తనదు | రూపుగా మీఱి చీఁకటి యేపు చూపె.

గీ. తనకుఁ బగయగు ప్రొద్దు వెనకిక నక
కనలు చీఁకటి రక్కసి కన్నులందుఁ
దొరఁగు కణకణమను నిప్పు నుకలనఁగఁ
బొలిచె నెడనెడ మిణుఁగురుఁ బుర్వులంత.

క. వెలిచాయ దోఁచె మూపు | వలనందగఁ దమ్మి విరుల వాతుల మూయన్
నె చూలన వెలవెలనగు | తొలుకడయను నెలఁత మొగము తొరపు జిగిగాన్.

క. కరముల రేఁడూర్పు మలఁజం | దురఁడావట నిర్గసోఁకుఁ దునుమంటకై వే
గరమా కసప్రంగతిదే | వర పంపిన కే పుఁజుట్టు వాలుం బోలెన్.

గీ. కీలెరుకుల్ల సహాత్రించి విన్నగాఁగ | వఱలు వెన్నుని గొలువంగ వచ్చు దివ్య
కూటితబిసిడి బలెగందు గొనబు మీటఁ | జందురుండల్లనల్లనఁ జదలఁ ద్రాఁకె.

క. అతఁడి వెన్నెలదగు మ | జ్జాతా జాబిల్లి పెజ్జ జగమున క్ల్లిన్
రాతిరి సోఁకిన చీఁకటి | బూతమువిడువంగఁ జల్లు బూతియుఁ బోలెన్.

సీ. వేల్పురాయఁడు దన వెలిసూవు దెలిగొరు సిగిఁ ద్రూఁకులఁ గాన కెడఁగలంగఁ
గటిమేనిఁ గార పాలెకడలిఁ జిల్వలతేనిఁ దెలిదీవిఁగన లేక తిరుగుచుండ
ముక్కంటి వలిగట్టు నిక్కమెట్టును నాల పోతుఁ గానక చాలఁబీతు కుడువ
వలుముగంబుల మేటి పలుకుఁదొయ్యలి నంచ వెలిమేని [illegible]కును వెదకఁబోవ
నన్నిరంగుల్లుతనరంగులై తలిర్ప | నిగిడి తెలిచాయ వెల్లి యైనిండె నన[illegible]
నిక్కి జగముల నెల్లను చిక్కటిల్లి | నిలిచి పొంగుచుఁ బండు వెన్నెల దనర్చెం
వ. అప్పుడు.

జేజేలరాయని తేజితలాటమై పరఁగెడు పికిలి పూబంతియనఁగ
మూరుపునాడేలు దొరపట్టి సీటుతోఁ గేలఁబూనిన కెంపుకేడెమనఁగ
నిట్టుపట్టు గుగ్రేని నైటైమునను । సొంపుచేనొప్పు తామరకొలనంగ
మొదలిమాపువ్వరతేజపిస్సద్దయైన । ప్రొద్దుకెఁజాయ నెంతయుఁబొడమియొప్పె.

వ. అట్టియెడ రావణుండు.

సీ. చనియుంగలముపేఁడి చల్లార్చి యల్కతో జమునిబీర మెల్లఁ జక్కఁబెట్టి
కొలముపాఁగెమున నప్పొలసుదిండిని నల్పి తెగినీటిజేని పెంపిగుఱఁజేసి
గాడుపునెందేని కదలిపోఁదూలించి యలకనేలెడువాని కలిమినాఁచి
తివిరిజాబిలితాల్పుఁదిరిపంబుగావించి వేల్పురాయని సొంపు గ్రుల్లగెల్చి
బలువుచేవారినెలవులుపాడుచేసి । చెలఁగి జేజేలకొమ్మలఁజెఱలువట్టి
కలన నెదిరింప నెవ్వరిఁగానకపుడు । కదలెఁదనదీవికలరి రక్కసులఱేఁడు.

ఆ. ఈకరణిఁ బదిమొగముల । రాకాసియెనర్చినట్టి రాయిడి చేతన్
జీకాకగుచును వేలుపు । లాకటిదేవరకు నుడువనరుగుచునెదుటన్.

సీ. కరువలినైగయూతంపురుల మున్నరమెల్లఁగ్రమ్మెడు పుప్పొళ్లదుమ్ముగాఁగఁ
గ్రరముపైఁ గదలెడుతరగలమొత్తముల్ సమకొన్నకొమ్మల గములుగాఁగఁ
దనలోన నెలమిని దరిఁజేరియున్నముత్యాలెల్లఁ దెలిచాయ పూలుగాఁగ
గొప్పలై వెన్నెల కుప్పలోయననొప్పు బలితంపు నురుగులు పండ్లుగాఁగఁ
జాలుకొనుతెల్ల రంగునఁ జాగి మానను । జెలువుమీఱుచు వేలుపుఁజెట్టువోలెఁ
బరఁగియెంతయునుప్పొంగుపాఁకడలిఁ । జేరిపలుమాఱుమదిసంతసిలుచునందు.

సీ. జగములుగలిగింపఁజాలునల్వకుఁబుట్టునిమ్మైనపొక్కిలి తమ్మివానిఁ
దొలుకారు మొగులుపైఁనలముమించన మేనఁగడునొప్పుపసిఁడిపచ్చడమువానిఁ
గలిమిదేవేరినక్కలికితోఁబుట్టిన కెంపునకున్నఁదాల్పుసొంపువానిఁ
గొలువవచ్చినప్రొద్దు నెలయునాఁ జేదోయిఁజుట్టుల్గు జిందంబు సొగయువాని
నాలిఁగన్నయ్యఁదనయంపకోలముల్కఁ । గట్టికడనొంచిమించిన కడిమివానిఁ
బ్రాఁతచదువుఁతుదలనేర్పడుచునొప్పు । నతకగలవానిఁదమబారినడఁచువాని.

చ. చిలువలతేనిమైయనెడు సెజ్జనుమించిన మంచుఁగొండపై
నలిఁబొలుపొందు కార్మొగులునాఁదగుచామనమేనినిద్దపుం
జెలువున మీఱుకుందనపుఁ జేలమెఱుంగున నొప్పువెన్నునిం
గలుములచానగేస్తుఁగని కన్నుల నీరొలుకంగ మ్రొక్కుచున్.

డనఁగ శత్రుఘ్నుఁడనఁగ నెయ్యమున మెఱసి
యిద్దఱిద్దఱు కవగూడి యెనసిరెప్పుడు.

వ. ఇట్లుగూర్మి కందుపొందెలుంగని విదియచందురుని యందమ్మున నానాటికి
నీటుగలిగి పెరుగుచు.

క. నెలప్రాఁదాలుపుపగిదిన్ । విలునేర్పున సాటిలేక వెలయుకొమరులన్
లలిఁజూచిపొంగుదశరథు । కొలువునకరుదెంచె గాధికొడుకుకడంకన్.

చ. పెరవునలావునన్ గడిమి బీరమునన్ బొలుపొందు రాచదే
వర మెఱయంగ నేర్చిన కువాళవుమన్నియ మూఁకనేలతో
ల్వరి బలుగొడ్డు తమ్మిచెలిపట్టిని సంద్రము వేల్పుమానిఁ జం
దురు బలిఁ జాగపున్ మొదవునన్ మఱపించిన యోగినేర్పరి.

క. కలుములకుబేర యసగెలు । పులవేలుపు రాకొమార పుడమిన్ మెయితోన్
మెలఁగువలరాయ పలుకుల । చిలువలరాయా దురంపు నెకకస్సేటీ.

మాలిని. కలుములచెలి చాలన్ గైపుతోఁ బాలవెల్లిన్
గలిగి చెలఁగుచున్ జాగంబుతో మించుతేఁడ్
వెలయఁగొలములోనన్ బీరమున్ లావుమీఱన్
గలిగి పొలుచుమైతోఁ గమ్మవిల్వానుమేటీ.

గద్య. ఇది శ్రీమదనగోపాల మంత్రప్రసాద లబ్ధసారస్వత సుకవిజనవర్ణనీయ వచో
విభవ భావనామాత్య తనూభవ పొన్నికంటి వంశవర్య తెలగనార్యప్రణీతంబైన
యయాతిచరిత్రంబను నచ్చ తెనుఁగుఁగబ్బంబునందు ద్వితీయాశ్వాసము.

---

## తృతీయాశ్వాసము.

---

క. సిరిగుబ్బచన్నుఁగొండల । దరులగతి మొగులుపగిదిఁ దవిలితిరుగున
మ్మరుతండ్రిమనుపునసమాల । నెరయునమీన్ ఖాన సింగిణీసుల్తానా.

వ. అటమీఁది తెఱంగు వినుండు.

గీ. ఇట్లువచ్చిన జడదారికెదురుగాఁగ । నరిగి సాఁగిలి మ్రొక్కి తానతఁడొసం-
గట్టి దీవనఁ గైకొని యలరితవిసి । నపుడు బంగరుగద్దియ యందునునిచి.

క. అడుగుందమ్ములుగూరిమిఁ । గడిగితగం గారవించి కరమలరుచుని
ప్పుడువచ్చిన పనియేమని । యడిగిన తాతబిసిఁ జూచి యోగాయున్నతోడన్.

క. విన్నవిమా యాటరూపై । యెన్నఁగఁదగినట్టిరాము నిఁకఁబాయమునం
బిన్నని చూడక యిటినా ? జన్నముఁగావంగఁబనుపఁజనునని పలుకన్.

వ. ప్రేమమీరం గొడుకు ననుపఁజాలకుండియు నతని పరుసదనంబునకు వెఱచి
యనిచిన నుచు సంతసంబున నెంతయు రాముఁడనుఁగుఁ దమ్మునితోడఁ రాజడ
దారి పజ్జం జనునప్పుడు.

చ. వెలుచగు రూపుతోఁ బునుకపేరులు దూలవెసందనాలు కన్
సెలవులు నాకికోంచు నిరుసేతులఁ గేడెము వాలుఁ బూనిమై
పొలసు గవుల్కొనంగ నురఁ బొట్టునఁ గ్రొవ్వెలుఁ జునార్చుచున్
పొలవకవచ్చు తాటకిఁ గనుంగొని రాజడదారి రాముతోన్.

క. అదె తాటకియను రక్కసి । గొదగొని యేతెంచె దీనిఁ గూల్పుము కడు జె
ట్టిదమగు తాపుల నిది యాఁ । డదియని చూడకుము మిగుల డాయఁగవచ్చెన్.

క. అని పల్కిన రాముఁడు గ । కన లక్ష్మణు చేతి విల్లుగొని యెక్కిడి తూ
పున దానిఁ బుడమిఁ గూల్చెన్ । దన తమ్ముని తోడ రాచదబిసి చెలఁగన్.

వ. ఇట్లు తాటకం గూల్చిన.

మ. మదిలోఁ గిన్కను బండ్లు గీఁటుకొనుచున్ మారీచుఁడే తేర బ
ల్లిదపుం డాపున సంభ్రమవ్యాలికి నోలిన్వానిఁ బోనేసి వే
కదియన్వచ్చు సుబాహుసం దునిమి వేడ్కన్ జన్నముఁ గాచి యా
పిదపన్ రాజడదారి వెంట జనకుం జేర్బోవుచు రానర్షులన్.

క. తనరుచు మిథిలకుఁ జనిచెం । పున విల్లెక్కించు పంతమున గెలిచి జగం
బున మించు చాలుపేరిటి । ననఁ బోఁడిం బెండ్లియౌ తన గొన్ని గులన్.

గీ. ఇట్లు చాలుపేరి యెలనాగఁ బెండ్లియై । గాధిపట్టి ననిచి కదలిచనుచుఁ
బెగియె సుర్కు రాచపగ సెలవేలుపు । బీరమెల్లఁ జక్కఁ బెట్టె యతఁ.

సీ. తగఁ బ్రోలికేగిన దశరథుఁ డర్మిలి రాముఁ బట్టముగట్టు రహిఁ రొయెంగి
కైకమానుపఁ దండ్రి కట్టడ చేసినఁ దోన తమ్ముఁడు నాలుఁ దోడరాఁగఁ
దనవీడు వెడలి కొందలముతో వెనువెంటఁ జనుదెంచు వారల ననిచి పిదపఁ
బోడవులొల్లక మేటి జడచారించదము ల్సవరించుకొని గంగ యవలికరిగి
గుహుని సన్మానించి యమ్మేటి కోయ్కాలోసఁగి । నిలుపుచును జిత్రకూటపు మలకు నేగి
కాంచి తబుసులు తమ్మును గారవింప । నచట నాకకొన్ని నాళ్ళుండె నంతనచట.

మ. కొడుకుం బాసినవంతఁ దండ్రి తెగినన్ గోర్కిన్ వసిష్ఠుండు కై
న్నడి ధాత్రీజని చిత్రకూటమున నన్నుం గాంచి రమ్మంచు వే
డుడుగుం దమ్ములమీఁద ప్రాలు భరతున్ హాళింగడు న్రాముఁడ
ప్పుడొడంబాటుగఁ జెప్పి పీటికతనిం బుత్తె చియ్యాపిమ్మటన్.

క. దండకావను కానకుఁజని । యుండఁగ రావణుని చెలియ లొగ్గిగలయుకనై
దండకు రాఁ లక్ష్మణుఁడది । మండాఁగఁగ ముక్కు సెవుల మనుకువ మాన్చెన్.

ఉ. గాసిలు దాని సూఁడున ఖరుఁగాఁ త్రిశిరుండు ఖరుండు దూషణుం
డీసున రాఁగ వారిని నేపఱఁ ద్రుంచిన రావణుండు దా
జేసి యొనుంగు రక్కసుల తేఁబసిఁడి మెకంబు రూపుగాఁ
జేసి యలంపఁ బంపుటయు సీత కనుంగొని దానిఁ దెమ్మనన్.

ఉ. తమ్ముని నాలిఁ గావనిడి దానిబడి జని వేడబంబు చె
య్యిమ్ములఁ గాన లేక యలయించుచుఁ బోవఁగఁ గిన్కతోఁ దా
నమ్మిరివోసి రేయియుటయు నా మెకమప్పుడు దెళ్ళచుండి రా
తమ్ముఁడ లక్ష్మణా యన నెదం బరపిల్లుచు సీత పంపినన్.

గీ. ఒరులపని యేమిచే జేలదొంటలనైనఁ । బాపము కడిమిని గలనిలోఁ బొలియఁ జేయ
నన్న బలిమిరయె తెంగి యునతివమాట । కులికి లక్ష్మణుఁడంతం తన్నాద్దిశేగ.

క. అతనిఁగనఁగొని రాముం । డో తమ్ముఁడ నేలచూలి నొక్కతె డి యి
ల్లెతె తరెయని దూఱుచు । నా తెగిం మెగంబుఁగొనుచు నరుదేంతన్.

సీ. జటదారియై వచ్చి తడయక రావణుం డతివఁ గొంపోయిన నాకుటింబుఁ
గొమ్మఁ గానక కానఁ ద్రిమ్మరి రాముండు లక్ష్మణుండడవినోలముల వెదకి
పనవఁగా సీతను గొనిపోవు రక్కసుఁ గని పోరి మడిసిన కడిఁదిప్రలుఁగు
నకుఁదగినట్టి చందము దీర్చి యరుగుచుఁ బంపచేరువ గాలిపట్టిఁ గాంచి
యతఁడు దెలుపంగ సుగ్రీవు నలరఁ జేసి। తమ్ముఁ గొలిపించుకొని వని నాయమైన
వాలిఁ దునుమాడి మఱితన వాఁడననిన । యంగదుని నిల్పి కొన్నినాళ్ల చటనుండి.

గీ. నేలచూలి వెదకఁ గాలిబిడ్డఁడులోను । గానుగలిగి నట్టి కడి దిక్కొమ్మ
మెకపు గముల ననుపమించియుండ ఱేలోన । ననుమఁడు ప్పుకడలి యవలి కరిగి.

గీ. సీతఁ గాంచి యల్లఁ జేరి యూరతా వేలు । పానవాలు గాఁగ ననిపినట్టి
యుంగరంబొసంగి యువిద నెమ్మదిలోని । వగపుకొంత కొంత నాగుఁ జేసి.

వ. అట్లు రాముండనిపిన యానవాలిచ్చి యచ్చెలువం గనినయబ్బురం గొబ్బున
బొంగి సింగారపుఁ దోఁటలోనుగాఁ దోఁపులు వెకళించి కాపులున్న రక్కసుల
నొక్కసంబుగా నొక్కుమడిన త్తుఁడు మొదలుగాఁ బలువురఁ బొలసు మేపరు-
జముని నెలవునకనిచి పెనఁకువఁ బట్టువడ జెట్టు వేడుకపడు గాడు ప్రవట్టి మీఁద
రాకాసి మొన్నలు గనలి.

క. పట్టుకొని కట్టి రావణు । కట్టెదుటను బెట్టితోఁకఁ గ్రందుగఁ గోకల్
ఁజుట్టించియింగలంబున । ముట్టించిన తను మఁడలిగి మొగమిగురింపన్.

క. ఉలికిపడి యతని పీటం । గాలితోఁ బురియెల్లఁ గలయఁగాఁ ద్రిమ్మరి కో
వెలచాయఁ జేసె మిక్కిలి । యలరుచుఁ బలుమాఱు ద్రుళ్లి నాడుచుఁ గినుకన్.

వ. ఇట్లు గాలించి యక్కపివలి పట్టి క్రమ్మఱియుఁ గొమ్మచేతి గుఱుతు గొనివచ్చి యుద్దియు స్సుద్ది యుద్దండి నెఱింగించినం బొంగి రాముండతనిఁ గౌఁగిటం జేర్చి గారవించి యుడుగర లిచ్చి యానిచిన పిమ్మట వేఁడివెలుంగునను గుఁజాలించి లిపించి కడలి దాఁటి చనవలయుం జాటింపు మనవుడు నతం డట్లు చేసిన మఱునాఁడు.

ఉ. కొమ్మ మెకంపు వెల్లువలు గొల్వఁగ వేగిర మేగుదెంచి సం
భ్రమ్ముకడం దగన్విడిసి రావణుతమ్ముఁడు చేరవచ్చినన్
రమ్మని వానికిన్ను నుపె రక్కసి పట్ట ముసంగి యేటితేఁ
డమ్మెయిఁ బ్రోవ యీమి మదినల్గుచుఁ దావిలు కేలఁ బూనుచున్.

క. కడునలిగి ప్రడిసిలించియు । బడలింపఁగ లేని కడన పట్టిరి యే మఱి వా
డిడి దప్పుఁ దూపని నారిం । దొడిగిన బలుచిలుకుఁ జూచి తొలఁకుటుడుగుచున్.

క. అప్పుడు చూచిన నేమని । చెప్పుచు నక్కడలి కాకి చిప్పలు నిసుమున్
గుప్పలు దెప్పలు తిప్పలు । కప్పలు చిక్కంగఁ దుమ్ము గ్రమ్ముచు నుండెన్.

గీ. కడలి యప్పుడొడలు గైకొని చనుదెంచి । కడిఁది మానికములు కానుకిచ్చి
తప్పుచేసినాఁడఁ దగఁ బ్రోవుమని రాము । నడుగుఁదమ్ములందుఁ బడి వడఁకుచు.

వ. తొలుమిడు కులకడలనుం గాన రానియా తేనింబులు దెఱంగులం బొగడి.

ఉ. తెన్నన కేను గాదనను దేవర మీయ సమిజ్జగంబునం
దెన్నటికిం దిరంబగుచు నెన్నిక కెక్కుచు నిల్చునట్లుగాఁ
దిన్నఁగఁ గట్టగట్టుఁ జను దెమ్మనినన్ సిరిగన్నతండుఁ దా
మన్ననఁ జేసిపంపి తనమందిరమునుం గొని రాముఁడిట్లనున్.

క. మనవాఁడైన సుగ్రీవుఁడు చె । ప్పిన మాటలు వింటిరింకఁ బెట్టు శివకమలల్
గొనివచ్చి కట్టకట్టుఁడు । చనవలయున్ గడలి దాఁటి సరగున మనకున్.

సీ. నెలతాల్పుదేవర యలిగినఁ బనిగాదు వెండిగుబ్బలి దెక యుండనిండు
నేలఁ గ్రక్కున గ్రుంగ నిల్వరాదెరికిఁ దెగియేడు కొండలు దివకరండు
నలి రేయుఁ బగలును నడకగానఁగ రాదు పుట్టుగ్రుంకుడు గట్లు వెట్టిరండు
తెవళ్ల బెంకులఁ దివియుట గారాదు లలిఁ బైఁడికులదెక నిలిపిరండు

మఱియుఁ జడు పేరుగలిగిన మలలనరసి। యున్నతావులు గదలింపక బిరండ్ల
మీరలంచును బిలిచి నేమించిపనుప । జరిగికొమ్మ మేకంబులు నట్లచేసి.

గీ. పెవకి మఱికల్లుమలెల్లఁ గదియఁజేర్చి। కట్టఁగట్టినఁ గౌసల్యపట్టిమల్లు
వెల్లువలమున్న నడిపించి వెనుకఁగదలి। తమ్ముఁడును దాను మున్నీరుదాఁటియవల.

వ. వేలంబువిడియుంచి మిడిమేలంబుగా నాలంబునకు వెడలురాక్షసి యొడయనిబెడి
దంబున కోర్చి యతనిప్రేఁకంబులయిన మూఁకల నేలంగూల్చి యంత.

సీ. అనిలోన మార్కొన్న యతికాయుఁ జంపించి కడిమి పిడ్యుజ్జిహ్వుఁ బడఁగవైచి
ఖడ్గరోముని మేను కడికండలుగఁజేసి పేర్మి విరూపాక్షుఁ బెరిదండిచి
యింద్రజిత్తును జమునింటికిననిపించి కుంభకర్ణుని నేలఁగూలనేసి
బలఁగంబుతోఁగూడ బలియురావణుఁద్రుంచిమఱియురక్కసులనందఱను నొంచి
పిల్చి రాక్షసప్రోలు విభీషణునకుఁ । దిరముగానిచ్చి సెకబాసఁజేఱిపట్టి
చాలు పేరింటి పూఁబోఁడినోలిఁగూడి। తానుఁదమ్ముఁడుఁదగనయోధ్యకునువచ్చె.

గీ. ఇట్లువచ్చి రాముఁ డెల్లు తేఁనిబ్రొద్దు । చూలిగాడ్పుపట్టి వాలిబిడ్డ
మ్మనువిభీషణుండు మొదలైనవారలఁ। గోర్కులొసఁగియనిపెఁబేర్కొనఁగ.

వ. ఇప్పగిదిననిచి రాముండుకడలేనిసిరులు దొడరి కడలి కడగాఁగల పుడమి తనవేత్తి
నిది కనువినుకలి నెలవుపుట్టుచేవిరివిగాఁజెప్పంబడి జగంబులెఱిఁగినదగుట్టం జేసి
నీకుం గొంచెంబుగాఁ జెప్పితి నట్లగుటమీవంటివారికి నొంటినడవినడ తేరంజనదని
యజ్జడవారిగారవించిపంచిన నయ్యయాతి మగిడి కాఱడవిలోఁ జనుదెంచు
నప్పుడు దప్పిగొని నలుగడలుం బరికించి.

క. తనదండ ప్రూఁకులుక లో । మునుగట్టిన ఆలసంది మొలచిన చెట్లుం
బెనఁగొనఁ చీక్లకట్టి గ్రమ్మం । గనఁదగు నొకపాడునూయి గనుఁగొనియంమన్.

సీ. మాటమాటైయల్లి మఱుఁగుమైడాఁగిన నీటిరాయనికూర్మి నెలఁతయనఁగఁ
నామఃతోడి సయ్యాటకై యచ్చోటి కరుగుదెంచిన కానసిరియనఁగ
జిలువకన్నియలతోఁ జెలిమిఁగావింపఁగా వచ్చినవలర్గాచ లచ్చియనఁగ
నడవిసోయగమున కబ్బురమంది కన్గొనఁగఁజేరిన పాఁపకొమ్మయనఁగ
ననుఁగుఁజెలినిబోలె నలరుఁదీవియనూఁది । నిగుడుమనములోని నెగులుచేతఁ
జష్టుడేమియైన సరగనాలించుచు । నున్నదానినొక్కయువిద్దఁగాంచి.

వ. వెఱఁగుపడి వారువంబుడిగ్గి చేరంజనుదెంచిన నయ్యయాతింగనిమున్నె టెంగ్గినది
గాన మదిలోన్నఁ బొంగునడలునిలుపలేక.

క. వలిపెంబు దెఱఁగు మోమున। నెలఁ జేరిన మంచుపగిది నెఱయం గాఁగో
పెలఁ క్రోల్చు చందమున నా । యెలనాగ కలంగి పెద్ద యెలుఁగున నేడ్చెన్.
వ. ఇట్లు తెగినగాము నమ్ముగువం గనుంగొని మది గరంగం గదియవచ్చి.
చ. అడలున నెంతయుం గలఁగి యగ్గలికం గుడిచేయి సాఁచి మై
వడఁకెడు కొమ్మ కేలు చెలువంబుగఁ బట్టి యయాతి నూతిలో
వెడలిచి యప్పుడమ్ముగువ వేనలి కన్నులు మోము చెక్కులున్
మెడ చనుదోయి నెన్నడుము మేను పిఱుందును గాంచి వేడుకన్.
క. కరమరుదుగ నప్పొలఁతుక । గరగరికకు వెఱఁగుపడుచుఁ గలికీ నీవె
వ్వరి దానవిందులో నే । కరణిం బడవలసెఁ జెప్పుము కల తెఱఁగనుఁడున్.
క. తను నెదకవచ్చి యటని । ల్చిన ఘూర్ణిక యనెడు దానిఁ జెలికత్తియఁ గ
గ్గాననది యత్తెఱఁగెల్లను । మును వెఱుఁగుటఁ జేసి రాచముక్కంటి వారన్.
చ. కనుఁగొని నెమ్మదిన్నెగులు గ్రమ్మఁగ రక్కసి యొజ్జ యంచుఁ బే
ర్కొనఁదగు నట్టి శుక్రునకుఁ గూరిమి కూఁతురు దేవయాన నాఁ
దనరిన యిన్నెలంత నాక తప్పనకై వృషపర్వు పట్టి నూ
తనుబడఁ ద్రోచిపోయె నని దాని తెఱంగది విన్నవించినన్.
గీ. అతివ వృషపర్వుఁడన నెవ్వఁ డతని యనుఁగుఁ
గూఁతు పేరేమి తనుఁ బట్టి నూతఁ ద్రోయ
నంత పని యేమి జేసె నీ యలరుఁబోఁడి
యనుడు నవ్వాలుఁగంటి యయాతిఁ జూచి.
క. విను వృషపర్వుఁ డనంగాఁ । దనరు నారక్కసుల తేఁడు తనకనిలోనం
బెనఁగఁదగు మాత్తనెంమం । గని యెఱుఁగక జగము నేలుఁగడలేని సిరిన్.
గీ. అతని కూఁతురు శర్మిష్ఠ యనఁగ నొప్పుఁ। గూర్మి సకియలు పేరుకు గొల్వనెపుడు
నా చెలియఁ గూడి యొకనాఁడు కొమ్మ యాడుకొను। చున రమరలు లేని చెలువములనఁ గిపెనఁ।
వ. తిరుగుచు నొక్కనాఁడు.
క. రంగగు తొడవులఁ బూఁతల । నంగుగఁ గైసేసి యందు నాఁడెడు తమిచేఁ
బొంగారెడు వేడుకతో । సింగారపుఁ దోఁటకరిగెఁ జెలువలుఁ దానున్.
సీ. మెదలుతు మ్మెదదిమ్ము లొదల చేనప్పొంగి దులకించు ప్రూఁబొదల్ దూఱిదూఱి
పలుమాఱు విరులతావుల తావులకు తీవయుయ్యెలల్ తగనెక్కి యూఁగియూఁగి
వలిపపయ్యెడల కొంగులు దొలంగఁగ నిక్కి కొమ్మలందు చున్ననల్ కోసి కోసి
పైఁడి మెట్టికలెక్కి పైకేగి చేంతగట్లాదు దాఁగురుమూఁత లాడియాడి

పరువులెత్తెడు నంచలఁబట్టిపట్టి । గట్టిపుప్పొడిమెట్టలు మెట్టిమెట్టి
యలసిచెమటలువాయనోలాడఁదలఁచి యందఱునుగూడి కొంతదవ్వరిగియచట.

సీ. పసిఁడిసోపానములపైఁగుంది కట్టకై కడునుద్ధుపైనజక్కవలకవలు
పరువంపుఁదోగలవెంబడిఁ గేరియుప్పనపట్టైలాడెను తేఁటిపట్టికిదుప్పు
తమకంబులుప్పొంగఁదరఁగయు న్నెలలెక్కికరమూఁగురాయంచ కన్నియలును
మాటికినెత్తమ్మి మఱువునఁబింపిల్చు గూయుచెగ్గురు వాచకొమ్మగములు
మలసిచెలువంపుఁగలువల మాటునందు । మేఁతఁదలఁపక ధ్వాఁగురుమూఁతలాడు
నీటిపులుఁగులత్తటుములునిగిడిమెఱయు । సిరులసీనెడుసొబగుచేఁ జెలఁగిమఱి—

సీ. నలువగుకలువ మొగ్గలు జడల్గా నాఁచుపోలుపైన కుచ్చులిబోంతగాఁగఁ
గడునొప్పుసంకులు కామాక్షికవగాఁగఁ దామరవిరిముద్దు మోముగాఁగఁ
సైవ్రాలుతోగరేకుకకపాలగాఁగఁ బుప్పొడిమైనలందినబూదిగాఁగ
సిరిమీలు లేఁదూఁడు సింగినాదముగాఁగఁ దలిరులేఁదీఁగలాతంబుగాఁగ
ముదురుమంకెనపూవుకెమ్మోవిగాఁగఁ । దఱులుచూపఱఁ గొలిపెడుకోమరుఁదనప్పు
జోగుతాలునుబోలెనుసొబగుమీఱు । కొలనుగాంచరిమదిలోని కోర్కెలలర.

వ. ఇట్లు గాంచి డగ్గఱం జనునప్పుడు.

క. ఒడికపుఁదనసొబగునకై । కుడుచెన్నులు గలుగఁజూచి కొలనాయప్పుల్
నడకొలఁకులంచువారికిఁ । గడువేడుకఁదమ్మితావి కానుకఁజేసెన్.

వ. చేసిన నచ్చెలువలు వలపుమించిన సొంపునం బెంపుగని కలంకదొఱంగిసిరిదొలంకు
కొలంకు కెలంకునకుం జని నిల్చి.

గీ. పలుదెఱంగులసొబగైన వలువలూడ్చి । చెందిరపుఁ గావిపావడల్పొందుపఱిచి.
చిగురుగరులన్ను దగుమరు చిలుకలనఁగ । నెంతతెల్లను గొలనిలోఁ బల్లికెఁజనఁగ.

గీ. తర్లఁగ చేతులఁబ్రువంపువిరులమాలి । యమలు కానుకగాఁ జేసియపుడు కొలఁకు
జెలియవారలయడుగులఁ జేర్చెఁదనదు । నాఁచుపేనలిపూఁదావి ననిచినిగుడ.

వ. ఇట్లు కొలనుసొచ్చి.

సీ. తమమోములకునులికి తగవడంకెడునట్లుతళ్కుగొట్టెడునీటితమ్ములలరఁ
దమచన్నుఁగవలయందములకోడుటఁబోలె జక్కవలొక్కమైఁజడలనెగయఁ
దమ్మకొప్పులకులోఁగి తలఁగిపోయెననంగఁ గప్పునిప్పగునాఁచు కడకుఁబోవఁ
దమకన్నులకుపీఁగి తలఁకుచందంబునఁ బెల్లుగాఁగయ్యలు తల్లడిల్లఁ
బూనితమచూపులకునోడిపోవుకరణిఁ । బలుమొగుళ్ళఁ దమ్మైదల్ గలఁగిపఱవ
ముందుముందుగఁ జెలరేఁగిమూఁకలగుచు । నీటిలో నిక్కెఁజను దెంచినెలఁతలలర్చి.

గీ. చల్లులాడఁగ నవ్వుచు చదలనెగసి । మగుడు తెఱనీటితుంపరల్ దగిలెఁ జూడ
వారినీరాటకును మెచ్చి వలపు ర్గాయఁ । డానికురియించు పువ్వులవానలనఁగ.

గీ. ఓలలిడి పట్టుసరిగిన కాయ్యనీట
మునిఁగి దవ్వుల లేత్తుఱ ముదితలంతఁ
దెలి మొగుల సొచ్చి వెడలుచుఁ జెలువుమీఱు
మేలి తుఱంగలి గొనిమెద్దు మించులనఁగ.

క. మగువ వడినీఁదుకొన్నఁ తా । నాగిఁ దవ్వుగఁ బోవఁ జూచి యొక్కతె కలువం
దగవైచిన కేకులు మైఁ । దగులు దనదివేల్పు తేనిఁ దలఁపించెఁ గడున్.

క. తమ్ములు నక్కొమ్మలకనుఁ । దమ్ములఁ గనఁగొనుచు నన్నదమ్ములటంచున్
జుమ్మని క్రమ్మోయుచుఁ దుమ్మెద । దిమ్ములువతిమూఁగ మునిఁగి తేలుచురలివల్.

క. విలసాగల గుబ్బలమదిఁ । జెలులని జక్కవలువచ్చుఁ జేరఁగఁ దమకా
బ్బలు వున్నదో యాబటువగు । చెలువున్నదో దాని కెలుఁగఁ జెల్లునె యచటన్.

తరల. పలుదెఱంగులఁ బోవు చందురుఁ బట్టనన్నిటి కన్నియై
యలిగి వేపెను వెంట నేగెడు నట్టి జాబిలి మేపరుల్
బలెజడల్గదు నీటఁ దేలుచుఁ బైపయింజను దేరఁగా
నిలువుటీఁతలవచ్చు కొమ్మల నెమ్మొగమ్ములు పొల్పగున్.

క. పొలఁతులనీడలు దగిరెన్ । బలువైయచ్చెలుల పొలుపుఁబడయఁగఁ గోర్కెన్
జెలువనెలంతలు నీటన్ । దలక్రిందయితపము సేయఁ దగిలిరనంగన్.

పంచచామరము. దళింగరంబు నిల్చిపొల్చి దాఁటి నీటిలోఁ బోరిం
జారిన్మునింగితేలి తేలి పొల్తుకల్దలిస్తు ర
చ్చరల్ మలంగలంచ మిచ్చు సంభ్రమనందుఁ బుట్టుచున్
దురీనలేచునట్టి జాడ దోఁపఁ జూపతెన్నఁగన్.

వ. ఇట్లు నీరాటసల్పునట్టియెడ.

క. సురకరువలిచమదెంచిన । దరిఁ జెట్టినకోక వెల్లఁ దడఁబడి పోఁగా
నరిగియవి దెచ్చి చెలు ల । బ్బురమగు తమచీరలెల్లఁ బూఁననంగన్.

క. లలినీనెఁతయుఁ దానుఁ । వలువలుపిడ్వఁగఁ దాల్చి పైళమెచెలువల్
దలఁషింపనెతెఁగినుకన్ । గులుకుచు రక్కసులతేని కూఁతురు తెగువన్.

ఉ. నెట్టన రేఁ నింబగలు నేరమి వెట్టునటంచు వేలుపుల్
వెట్టియుఁ గొట్నముల్సలుప వీలని చేబలువొప్పసోఁకుడ్మం

జన్నము ...న్నఁ జేయుచు నసంబున మీతెసువారు సాటియే
కన్నియ యల్కలేక యొడికంబుగ నుండెడి ప్రౌఢకెయ్యెడన్.

క. తిట్టినఁ గొట్టిన బన్నము । పుట్టించిన నలుకయును వగపు మనుదొలఁగుచునే
పుట్టున నలరిన మరలం । బుట్టువు వారలకు లేదు పుణ్యంబొండెన్.

వ. కావున నలుకనలఁపువలకు నిలుకడయగుట దానివిధువవలయుఁ దెలియుమదియు
న్నంగాక ప్రోచువా రొకనాక్కకొదవగలిగినమది నెడంద గదిదియేమిరమ్మనవుడు
దేవయాన యతనికిట్లనియె.

క. నిందుదలంపునఁ దశరా । పొందనుగారవములేని పొరపొచ్చమునం
గొండంత పసిఁడియిచ్చిన । నుండఁగాఁదగునె వారియొద్దం దండ్రీ.

క. నెట్టుకొను చట్టుటికంబును । జెలికారము మరుపుదనకుఁ జేసినమేలుం
దలఁపక యెగ్గులు పలికెడు । మలుచలకడనుండి రేని మోసమువచ్చున్.

వ. కావున నేను వృషపర్వుని పీడుసొర నొల్లననినతండు.

క. పుట్టిన్నునుఁ బాసిన నా । కెట్టు మెయి నిల్చుచునసుఖ లేమగడయనె
పుట్టునను పీవ నీతో । నెట్టనఁ జనుదెంతుననుచు నెగులునఁ బలికెన్.

వ. అత్తెఱంగున నుండ వృషపర్వుండటకువచ్చి వంతతో నెంతయు విన్ననయినయున్న
— కన్నియం దొడలపయినిడుకొని బహలికఁ గడలేక కడలుకొను నడలునం
దగులు నాజ్ఞలం గనుంగొని ప్రొమ్మిక్కయిట్లనియె.

సీ. ధరములోఁ దెలుగంటిదొర సింగలపువేల్పుఁ గడిమిగెల్చినది నీకతనఁ గాదె
కలనిలో జముని రక్కసితెం నెదిరించి గాసిఁబెట్టుటయు నీకతనఁ గాదె
యసిలోన నీటిరాయని గాడ్పుఁ దెరలించి పెతమాలు ఛెల్ల నీకతనఁ గాదె
కయ్యాన జక్కులను గమికాని మొక్కటిఁ గుతిలపెట్టుటయు నీకతన గాదె
తమ్మిచూలిధ్యయు వెన్నుండు దలఁకిమాకుఁ । గలఁగుచుండుట్లు రెల్లనీకతనఁ గాదె
కాకయుండినఁ దలఁప రక్కసులకెల్లఁ । జేయునిల్చునె జేజేల పేర్మి కతన.

క. అనిపలికి దేవయానం । గనుఁగొని రక్కసులఱేఁడు కలఁగకు నీకీ
కినుకేమిటఁ దీర్చెడునది । వినిపింపుమొనర్తునట్లు వేగిరమనుడున్.

వ. దేవయాన యిట్లనియె.

క. అట్టైననీదుకూతిమి । పట్టిని శర్మిష్ఠ నాకుఁ బనిసేయంగాఁ
గట్టడసేయుము...నను । నెట్టన రక్కసులఱేఁడు నెమ్మదిలోనన్.

క. కరమలరి కూఁతురను పెం । పరయక యాతండు దేవయానకొసఁగె వే
వురువిరిబోఁడులతోడుత । వరుసను శర్మిష్ఠఁ దెచ్చి వరపుష్ఠు గాఁగన్.

వ. అప్పుడు వృషపర్వుండు తనకూఁతు నిచ్చుటకు సంతసిల్లి దేవయానిఁ జూచి శుక్రు
నకిట్లనియె.

క. ఏకసీకాలమింటం | జూడము ముంగురులు గూడ చుంగొనబున ని
ట్టిడేరి కట్టుదప్పిన | చేడియ నిఁకనైనఁ బెండ్లిసేయందగదే.

గీ. అనిన శుక్రుఁడనియె నాసోఁకు జేనితోఁ | గలదు దీనికొకటి కొంచుఁడు దాల్లి
పెలుచ నేలవేల్పుఁ బెండ్లి గాకుండెను | మనుచుఁ గినుకఁ బలికి యతఁడు చనియె.

గీ. అంతకు తమున నీయింత కెందుఁదగిన | చెలువు నెవ్వని గూర్చునో నలువ యనుచు
వంతనున్నాఁడఁ గాక యీ వాలుఁగంటి | పెండ్లిఁ దూఁగించు టిదియెంత పెద్దమాట.

వ. అనవుడు.

క. అయ్యా కచుఁడన నెవ్వం | డయ్యో యీ ముద్దరాలి నట్లనఁగఁ గతం
బెయ్యది యనవుడు నత్తాలి | దయ్యంబుల యొజ్జ వలికెఁ దగ నాతనితోన్.

సీ. వినుమ నరక్కసులును వేలుపులుఁ దొల్లి కలనిలోఁ బోరాడి పొలియుచుండఁ
దెగిన సోఁకుఁడు మూఁక మగుడ నా బలువిద్దె పెంపు చే బ్రదికిరంపిల్లుచుండ
జేజేలు పొలివోయి చేయునట్టిది లేక కింకతోఁ బోగిలి యాకిలెటింగి
యిద్దిసేర్చి రాఁ బ్రోడ యెవ్వఁడో యనఁ జాలఁ దలపోసి తమ యొజ్జ దండ కరిగి
విన్నఁదనముల చేసొంపు చెన్ను దఱిగి | యందఱును మ్రొక్కి ముందఱ కరుగుదెంచి
కలఁక డగ్గుత్తికలచేత నెలుఁగు రాలు | పడుచునుండఁగ నిట్లని పలికిరపుడు.

గీ. రాజమగఁడైన వెనుకను గాజుకడియ | మన్న సామెత సిక్కెంబె యయ్యె మాకు
నీవు గల్గి యునికిటువంటి నెగులు గల్గె | నింక మా చందమేమని యున్నకొనఁగ.

క. వినురక్కసులును వేల్పులు | ననియెడు నీరెంట దెగల నాశుక్రుఁడు నీ
వును గద నడిపెడువారతఁ | డనిశీల్గిన పోలసుదిండ్ల నందఱ మనుపన్.

క. బలిసిరి రక్కసులనిలోఁ | బొలిసిన వారెల్ల మనఁగఁ బోయిన పోకై
యలసిరి వేల్పులు మగుడం | దలకొను బ్రదుకాసలేమిఁ దలఁపవు దీనిన్.

క. అనయము నీతోఁ సరివాఁ | డనిలో రక్కసుల మొనల నన్నిటి మనుపన్
దనవారిఁ బ్రోవఁ డితఁడన | వినుచున నీ సడికి నెట్లు వెఱవవు తండ్రీ.

గీ. ఒరునిఁ బ్రోచుటకొఱకుఁగా నరుగుదెంచి | చెనఁటినైనను వేఁడఁగాఁ జెల్లుఁ బుడమి
వెల్గుచు జేజేలఁ గమిఁ బ్రోవ వెన్నుఁడరిగి | రక్కసుని వేఁడె నతనికిఁ దక్కువేమి.

ఉ. దేవర పట్టి నిక్కము మదిం బసిబిడ్డఁడు నాక పేర్మి సం
జీవనిఁ జేరఁ బంపఁదది సేకఱు నీతని చేతఁ బెంపునుం

జుట్టుమీఁదఁ బ్రొద్దుచేరె సంజతోడనీటిరా
పట్టుపయ్య కెంపుగోడపట్టుపైఁడిసాననాన్.

క. అక్కచుఁడు రామినప్పుడు । పొక్కుచు నీదేవయాన పోడముగనయో
రక్కసులచేత మడిసెనె । యక్కటతనుఁగన్నతల్లి యటుమటు గుడువన్.

ఉ. అక్కరులా మొగఁబు చెలువాకనుఁ దమ్ములసోయగంబు నా
యక్కనుజేతు లానడుము నాపిఱుఁ దాతోడ లాయొయారపుం
బిక్కలుమెట్టుఁదమ్ములను బ్రేముడి నామదిఁ బాయకుండఁగా
నక్కచునెట్టుగామఱతు నాఱడిదయ్యము యింతచేసితే.

క. మునునలువ యొకఁగి మదివా । కినుమునఁగా వింపఁబోలు నిమ్మెయిఁగాకుం
డిననింతతడవు కచునిం । గనుఁగొనకుండుటకు నెట్లుగా నిటులోర్తున్.

క. అనివాఁడు రాకయుండినఁ । దనమేను దాఱంగ మదిని దహాతహాపడు దీ
ప్తినిఁ గాంచి చాలవేసరి । యనసినవగడించుపలుప నేఁట్లుంటిన్.

క. వినువేల్పుటొజ్జకొడుకని । కినుకన్ రక్కసులు వాని గీటడఁచెదరా
తనికింతవగవనేటికిఁ । జనుఁగాకలపుట్టువేసు చక్కిఁకిఁగడఁకన్.

వ. అనవుడు మిగులవగలనాగిలి యిమ్మగువ యిట్లనియె.

చ. గొనములప్రోక యంగిరసు కూరిమిమన్మఁడు వేల్పుటొజ్జపె
ర్మిని గనుఁగొన్నబిడ్డ మఱిమీకునుజట్టు కడిందిరూపు నే
ర్పును గడునేమముంగలుగు ప్రోడ వితా తొలువేల్పు మూఁకచేఁ
జనినకచుం దలంప మదిజాలిఁగరంగదె యెట్టివారికిన్.

సీ. జగములఁగలిగింపఁ జాలునల్లొగముల దొరపట్టియైన యంగిరసుమన్మఁ
డరయవేల్పుల్లకెల్ల న్నయగారనంతగు నుడుగు ఱేనికిఁగూర్మికొడుకుఁగుఱ్ఱ
వేల్పుటాలునోఁచన నోములపంటయై కనుపట్టఁగాఁ దారకన్నబిడ్డ
భృగువుమూఁడవయప్పతగఁదీర్పఁగలిగిన పెనులిప్పవగునీకు ననుఁగుఁజట్టు
నేలవేలుపు మొదలిటి నేమములకు । నెలవు చెలువపు గమికాఁడు పిలుకుమారి
రక్కసులచేతఁ బోయిన యక్కచునకు । వగవకెట్లోర్తు మైయొల్ల నాగులఁదండ్రి.

గీ. అతనిఁజూచి కాని యారగింపనటంచు । వగచుచున్న దీని తెగువయొఱిఁగి
చిదిమికడుపులోనఁ జేవెట్టికలఁచిన । యట్టులైననోర్వ కడలిన్వెన్ను.

మ. వినులోచూపున నేలపైనడవులున్ వ్రేళ్ళు న్మలల్సంద్రము
ల్వినుదీవుల్లగు పల్లియల్వెదకి సోకింజిల్వచేఁ డిమ్ములు

స్వామిద్రోహుల్లడు వేలుపున్నెలవు లన్నిం జూచి యేఁ గానలే
కనయంబున్నదిన బ్రహ్మస్వర్గపు నాకంతంతయుం గ్రమ్మఁగన్.

గీ. మఱియు నట్లు చూడ మదిలోనఁ దోఁచినఁ । గంటిబాధియగుచుఁ గల్లుతోడఁ
గలసినాడు సంతస్సుఁ గడుపులోనఁ నయన్న । కచుని సంతసంబు గడలుకొనఁగ.

క. కలుదోసంబున రాక్ష । సులు చేసిన యట్టి కాని చొప్పును మదిలోఁ
దెలిసికొని యులుకవాడమినఁ । గలఁగుచు నిట్లంటి నిజ్జగంబుల నిల్పన్.

క. తొలుబాముల బలు నేమం । బులతోడం జెక్కుజన్నములు సేయంగాఁ
గలతెలివిఁ జెఱుచు నియ్యెడఁ । గలుద్రావం దగునె యొఱుక గలవారలకున్.

క. అనికలు ద్రావుట దుర్వ్యా । కిని గాదని పలికి పంతగించుచు సంజీ
వని చేతఁ గడుపులోఁ గచు । నవు నను బ్రతికింపఁ దలిసి యతఁడిట్లనియెన్.

ఉ. ల్లావుఁ గడంకయు న్మఱి నలంగని మేనును బొందఁగల్గెనే
దేవర విద్దెచే బ్రదికితిం డగ నీకడు పింక పెళ్ళనే
త్రోవ యొయానతీవలయుఁ దోఁచినలాగున నన్నుఁ బ్రోవఁగా
నావుడు నోడకుండుమని నామదిపీఁడ యడంచు జెట్లొకో.

వ. అని పలు దెఱంగులం దలపోసి.

క. వినుకడుపు ద్రక్కలించుచుఁ । జను దేరఁగ స్రోలి పడ్డ సరగ నెకడఁ కన్
నను బ్రదికింపఁగ సంజీ । వని చెప్పితిఁ గచునకపుడు వదంని కూర్మిన్.

గీ. బ్రతుకు త్రోవయిట్లు పరఁగ నేఁ జెప్పినఁ । గచుఁడు పెడతలనిండుఁ గడుపు వ్రచ్చి
పుట్టుగట్టుచటిం బొదమునతమ్ముల విందు । కరణి మేని తెల్వి కడలుకొనఁగ.

చ. వెలఁగుచు నిట్టు దాఁగ గడుపు వ్రచ్చియు వెళ్ళిన మేనిలోను సుర
దొలఁగుట నేలపైఁ బడినఁ దోడనె నన్బ్రతికించి నేర్పుతో
వెలసెను వానికిం బ్రతుకువిద్దెయు మిక్కిలి సొంపుతోడ వే
ల్పులు గొనియాడుచుం గురియు పువ్వులవానలు మీఁదఁ బర్వఁగన్.

వ. ఇట్లు సంజీవని వడసి కచుం డుత్సాహదశవున్న వాఁడయి మాతో నొక్కనాఁడిట్లనియె.

క. మీరును మీదేవేరియు । గారవమునఁ బ్రోవఁ దడవుగా నిటనుంటిన్
గోరినది గల్గె నంపుఁడు । తారను మాతండ్రిఁ జూడఁ దలఁచితి ననుచున్.

ఉ. పిన్నవుగాన నీవు కడుఁ బ్రేముడి ముంగిటిలోనఁ ద్రిమ్మరన్
నిన్నబలెందల్లంపబడు నీవిటనిల్చిన పెక్కులేండ్లు మా
కన్నులువాచు నీమొగము గానక యెప్పుడుఁ జూడకున్న నా
యన్న యిదేటికిం దవక మారసి చూచిన వింతగాఁడవే.

క. నీవనఁగ దేవయానవఁ । గావఁటే మాకు వింత గాదే కద నీ
కీవేగిర మేటికి మది । నావృషనతఁడెట్లొన్నినాళ్ళుండి వెసన్.

వ. తెనవీటికిం బోయెదనని విన్నవించుటయు.

సీ. కరము పెద్దయిన యంగిరసుచెంతకుఁబోయి చక్కఁగాఁ జాగిలి మ్రొక్కెనను
జేజేల రాజయై చెలఁగెడుమీతండ్రిఁ గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చుకొనియెననుము
తనతోడఁబుట్టువుఁదార నెమ్మదిలోన సర్మిలి దైవార నడిగెననుము
కడు జయంతుఁడు లోనుగాఁగొమాళ్లనుగూడ వేల్పుచున్నీని దీవించెననుము
మఱియుఁ దక్కినవారి నామాటగానె । తగినలాగునఁ బలుకుమందఱకుఁజాల
నలరునీవని చెప్పినే ననుపనతఁడు । నరుగ నమకట్టి యున్నచో నప్పుడెఱిఁగి.

సీ. ముదురు వెన్నెలగాయు ముత్యాలతిన్నెపైఁ బైఁడి యచ్చనగండ్లు పాఱవైచి
మేఱియాడి యాడి తామర కెంపుఁబీటపై నోమనగుంటల నుజ్జగించి
పాఁపమేపరిపచ్చ పన్నారులోవులఁగుఱుకు గుజ్జనగూళ్లు గుడుచుటుడిగి
తనయీడువారైన తలిరాకుఁబోఁడ్లతో సిరిబొమ్మ పెండ్లిండ్లు సేయకడఁకి
తోడిచెలులెల్ల వెఱఁగుతోఁ గూడరాఁగ । గానబుఁగనుదమ్ములనునీళ్ళు గ్రుక్కుకొనుచుఁ
జిన్నవేసలి జాఱంగఁ జిన్నవోయి । తెగువనచటికి నేతెంచె దేవయాన.

వ. ఇట్లువచ్చిన నక్కచుం డిట్లనియె.

మత్తకోకిల. తోడఁబుట్టుగు కన్నసీవాఁగిఁ దోడునీడయి ప్రాణఁగా
నీడ నెకౌఁదలేకయుండితి నింకమాతలిదండ్రులన్
జూడఁబోయెదనయ్య వారలఁ జూచిరమ్మనిపంపెనో
చేడియా మదిలోన నాదగు సేమమారయుచుండుమీ.

క. అనిపలుకఁ గొమ్మమిక్కిలి । తనమది గలఁగంగ నిట్టితలఁపులుగలవే
మునునీకు [illegible]కుడగాలము । నానరించెం దమ్మిచూలి యుల్లములంపున్.

సీ. ముగురువేల్పులు మెచ్చు భృగువునకర్మిలి మనుమఁడన్నది నీకుఁజనవుగాదె
యానయంబు దొలివేల్పులయ్యగారికిఁగూర్మి యల్లుఁడన్నది నీకు ననువుగాదె
పొగడు నేలువుచేతఁ దగు దేవయానకుఁ జెనిమిటి యనసీకుఁ జెలువుగాదె
తుదవృషపర్వుఁడు మొదలైనరక్కసుల్మన్నించుటది నీకు వన్నెగాదె
తోడఁగియతాఁ గామినీ మదిఁదోఁచకున్న । ననుఁగులగు పెద్దవారల నడిగిచూడు
మేలవిడనాడ నాలిగో నేలునన్ను । వినుము చెప్పెద మాటలు గ్లిష్టయ్యను నేల.

క. అనఁ జెవులుమూసికొనుచుం । దనమదిలోనలిగికచుఁడు తలిరుంబోఁడీ
వినఁదగని పల్కుపలుకం । జనునే తలపోయనిట్లు చాలునుడుగుమీ.

క. విను చదువు చెప్పిన తెఱఁగుం । దనతండ్రియు నొక్కరూప తలఁపఁగ నదిగా
వున నీవు నాకుఁ జెల్లెల । వనువగు నా యొట్టిమాట లాడెఁగ నీకున్.

ఉ. నావుడు దేవయాని మదినాఁటిన యల్కను లైన నీకు సం
జీవని పంపుసేయదని చేరికఁ బల్కె నతండు మిక్కిలిం
డావగనొందియో నెలఁత నాకది వమ్మును పోయె నేనియున్
నీతని నిట్లు నావలన నేర్చిన వారికిఁ బంపు సేయదే.

క. అనికిన్కతోడ నిటువలెఁ । బనిమాలిన పాటు నన్నుఁ బలికితి వటుగా
వున నీకు నెలవేలుపు । పనిమిటి గాకుండు ననుచుఁ బలుచన్నాడిపెన్.

వ. ఇట్టి శాపం బలికి కచుండు తన నెలవునకుం జనియె ననిపలికి శుక్రుండు వృషపర్వుం
డును దోడనేగుదెర పీటికిం దోడ్కొని వచ్చిన దేవయాని శర్మిష్ఠ గొలువఁ
బాటలం బేటమాటలం దోఁటలం బ్రొద్దుగడపుచు నుండె నంత.

చ. కొఱలెడు తేజుచేఁ బసిఁడి గుబ్బలియు న్మఱి వెండికొండయుం
గొఱఁగునటంచు సంద్రములు కాఁకల నింకునటంచు నెల్లెడ
న్నెఱయున సంపుఁగప్పురము నించి జగంబులఁ గల్గువారలం
దఱుగొని యాపుచుండఁగ సతంబుగ రాసిరిఁ గన్న నేర్పరీ.

క. పురుకుత్సు రంతిదేవు స । గరుని న్మాంధాతఁ బృథుని గయుని దిలీపున్
భరతు యయాతిం దెగడెదు । సరవిఁ జగములను మించు చాగపుఁ గడలీ.

మాలిని. నలుమొగములచూలు న్నల్లనామేని డాలుం
జెలఁగు నడుగుజాలున్ జిందముం జుట్టువాలు
న్వలచు కలిమియాలు న్వన్నె మవ్వల్వమేలుం
గలుగునతఁడు నీపైఁ గల్మితో నుండు మేటీ.

గద్య. ఇది శ్రీమదనగోపాల మంత్ర ప్రసాద లబ్ధ సారస్వత సుకవిహిత వచో విభావ
భావనామాత్య తనూభవ పొన్నికంటి తెలగనార్య ప్రణీతం బయిన యయాతి
చరిత్రంబను నచ్చతెలుఁగుఁ గబ్బంబునందుఁ దృతీయాశ్వాసము.

---

## చతుర్థాశ్వాసము.

---

క. సిరిమీఁటిన ఱాజుఱేఁడే । వర మానిసితనము పూని వచ్చిన నెకకన్
దొరవేలుప బలుసిలుకడ । తఱికొండ యమీనుఖాన తలఁపుల నెలవా.

వ. అటమీఁది తెఱంగు వినుము.

చ. కరువలిరక్కసుల్ కెరలి గ్రమ్మిపడంగఁగ మ్రాఁకువేల్పులన్
దొరకొని యాకురెంటెములు దోఁచఁగఁ గోవెల కూఁతఁ జెప్పఁగా
నరయుచు చారలంగడిమి నామని వెన్నుఁడు నొంపఁజిందు నె
త్తురుబలె లేఁజిగుళ్లలరెఁ దోఁపులఁ జూపఱ చూడ్కి పండువై.

సీ. అలమింటఁ జెలఁగురా చిలుకలచాలుపుల్ వేలుపు మన్నని బిడ్డలుగాఁగఁ
బూఁదేనియలఁ జాలఁ బొదలు తేఁటులు మ్రోఁత రహిమించు నుఱుముల రవలిగాఁగ
మూఁకలై పొడమైన చీఁకటి మ్రాఁకుల చాళ్లు గార్కొన్న మొగుళ్లు గాఁగ
వెలుతురీను కజాలు విరిదేనియలసోన వదలక కురియు పెన్ వానగాఁగ
వేసకలుమి ఱఁదోఁటల నాడు కొమ్మలు వెలఁదు లెల్లను మెఱుఁగుఁదీవియలు గాఁగఁ
గ్రమ్మియుప్పొంగుచును దొలుకారు వోలె వలపు నెఱపుచు నామని పాలుపడెను.

గీ. ఎలమి మైజాజి యూరంపు టేనుఁగులను నొంచు నామని యను తెఱనోటి మెకము
గొళ్లగింగను దగిమేఁడుగులను మొగ్గలమరెఁ దమరంగు మిన్నల్లనలమికొనఁగ.

క. క్రొంజిగురుజొంపము లందగెబలు మావులంతఁ దలిసెల్లెనటన్
జెందిరపుఁగాసి పసగల నందంబగు మరుని తేరు లనఁగాఁ బొలుపై.

మత్తకోకిల. ఏచెమావులుఁ గ్రోవులున్ దగు నిప్పలున్ గురివెందలున్
బూచెనిమ్ములు దాడిమమ్ములుఁ బొన్నలున్ సురపొన్నలున్
గాచెఁజిన్నల కన్నులున్నగ గంగరావులు మోవులున్
దాచెఁగొమ్మలసింగి గోఁగులు దావులున్ గడుఁ దీవులన్.

శా. ప్రేలుంగొమ్మలు నేలదారసిలినన్ వెళ్లంగ రాకుండఁగా
లోలోఁ ద్రిమ్మరు నాలిగాడ్పులు పగళ్లన్ రేలుఁ బూఁదావులన్
జాలన్ ముచ్చిలిప్రోవఁబట్టుకొని పజ్జన్ బచ్చగండార్లలో
సోలన్ గాపాడ బెట్టె నామని యనన్ జూపట్టెఁ దోఁటలన్.

గీ. అపురేఁబుప్పొడి కుప్పలై యంతనంత మెట్టదామర పాకుల మీఁద జాతి
పైఁడి చూలాలి వేళ్లవాయఁదోఁట కలిమి చెవిపెట్టు కలవంటకంబులనఁగ.

చ. చలిమిరిగాడ్పు చే నెగసిసన్నపుసుళ్లగు చాకసంపుమం
దలవిలసిల్లెఁ బుప్పొడులు దట్టముగా మదిఁ గ్రమ్ము కూర్మిచేఁ
గలఁగివిరాలిఁగుందు తెఱగంటి నెలంతలమీఁదఁ జొన్పఁ బూ
విలుతుని పైఁడిచుట్టలుఁగు వేలములుం బలె సొంపు పెంపునన్.

క. అగిసెవిరుల్ కరువలిచే నెగయం దోఁదేఁటి చాల్పు లేగుందలుచై
తొగరాచ పదువులన్ వెను తగులుచు నెలదిండిపించు దాల్కొను పగిదిన్.

మ. ఎఱమిఱి దమ్మిదమ్మోఁతవా సైరవమై ఝంపొందమత్తిల్లుకో
వెలసీకారుల కూఁకపాటలమరన్ వేశక్కటో నాఱిగా
డ్పుల పేరడిగలనట్టువుల్ గఱపఁగోపుల్ చూపులేఁదీవపా
త్రలకయ్యాహూనిప్రావుముత్తైప్రసరుల్ జాల్పఁగ నిచ్చెన్ గడున్.

వ. మఱియు విరితేనియ లానిపూని మత్తిలి తత్తఱంబున దిరుగు తేఁటిమొత్తంబుల
రొదఱకలసన్నం గరువలి గట్టువనట్టువ గఱప నామనిరా తేనికసా నాఁటిన పాత
రలముందఱఁ గ్రంకుగా నెత్తినమవ్వంపునప్పటంబుల తెరలమరియపులసం గ్రమ్ము
పూదుమ్ముల మమ్మరంబులం గొమ్మలంగానక త్రిమ్మరు కలికి గోరువంకల పలుకుల
రొదల నెదలు కలంగ మెలంగు తెరువరులనేయ బాసటంబు చిలికిన మరుఁచిలుకలు
వాసి తుమ్మెదదిమ్ములనలరు నలరులం గాంచి వలతేని కానిపనికేఁగి యుకం గిసంగ్గోను
తోఁటకలిమి చెలియచూపుల సొంపున గెంపుపోసనఁబులగు దాసనంబులును దాస
నంబులు చీఁకటి క్రమ్మఁకు మ్రాఁకులలోన నిరులు దోరలు తమదాయయగు వేఁడి
వెలుంగు నింగికి వెఱచి పఱచిన నతఃమైపుట్టుగులం బట్టిలోఁ దుకొన్న వదువున
నున్న గేకిసలు గొట్టు నిర్గపట్టి కింపునుం బోలెఁ జెలంగుకో వెలలును గోపెలల్గొగరుం
జిగురు లుమియంగ నున్నీటితో నానిన మానికంబులు వెడలించు నించు మొగు
లుం దెగలని చెట్టుగానాడు జుట్టునట్టువపిట్టలు కఱచిలువ తెఱవలను తలఁపు
పెంపుర జడలకొడియ వడివడిం దీవయుయ్యెలలూఁగు మగువలనగవు వెన్నెలలోన
చుక్కల పెక్కువలుం బోలెఁ గానిపించు పొన్న మొగ్గలును బొన్నమొగ్గలనొత్తి న
ముత్తైపుందొడవులయ్యేడనడి పూఁదేనియల జలకంబాడు తోఁపువేలుపుఁజానకు
దిద్దినసిద్దంపుఁ బసపుముద్దల యొద్దికందగు పెద్దమ్మపండ్లును గొమ్మపండ్ల యచ్చు
పుఁ బచ్చడాలు చాలన్నీలుచుం గారుగోఁగులమైఁబొగ్గఁజనుపకంబులని కలంగి
తొలంగి చేరికతిరుగు తత్తరంబుల తేఁటిమొత్తంబులం గేలిచేసి మించు తీవచాసల
యొలుంగులనం గులుకు పలుకులుగల కలికిచిలుకలును జిలుకముక్కుల నాక్కుఁబను
మారేడుంబండ్ల చెన్నగని తమయున్నల చన్నులపోలికలని విరాలింజాలింబడు తెరు
వరులంజూచి నగచు మ్రాఁకులకన్నీరునుం బోలె జోరునంజాలు పూఁదేనియలును
బూఁదేనియ కాలువవాళ్ళ సుళ్లంబడి వడివడిం దిరుగు నురుని కెంపుబొంగరంబు
లుంబోని మెట్టదామర మొగడలును దామర మొగడల్గం దెగడు చిన్నిచన్నులు
గల కన్నియలున్న చూపం బూఁదేనియలాని తేనియలయందుం బాడు నేగ్వలకు
వెచ్చిపచ్చవిల్కాఁడు గురియించు విరివానలు బోలెఁగరువలిచేఁ దొరుఁగు పరు
వంపు ననలునుం గలిగి వలరాజులాయంబునుం బోలె మావులకుం దానకంబై చా

సౌధాగ్రంబునుం బోలె మోవులం బాపటలసొంపు మీఱి వెలయం బ్రసూన్నల చెన్ను
గ్రోలం బులం బాదలి తోఁపు చూపఱకు । శ్రీరాముని గా నామునియొప్పెనంత.

క. తోరపుఁగన్నుల వేవుర । తోరపుశర్మక్ష కొలువ వచ్చుల కింపుచునిల
గారవపుఁ దోఁ కఁ జనియెన్ । గారవమున చేవ యానకడు నాటు తమిన్.

సీ. మెదలెడు గంతుఁగుమ్మెదల పెఁరొదలచేఁ బొదలెడుగురివెంద పొదలు దాటి
కలకలఁ బల్కు చిల్కలకోలంబులఁ జాలనలరు పొన్నల మూఁగి యలరులాఱగ
చెలఁగుచుఁ గిలకిలల్ గులుకు కోవెలలకు నలఁకువల్ గడపు జిన్నలకునుతికి
ననల షేమరున్నన్నల చేఁ జెన్నైన పొగడలకున దమ్మఁ బొగడ నరిగి
కలికియేల దేఁటి కసుపుల కలికియులికి । పెనలుగొనియెడు చిన్నిగుంపెనల కేగి
మరల కానట్టు మెట్టుతామరలు చిదిమి। తోఁట నాడుచు నెలఁతుకల్ నీటు మెఱసి.

ఉ. తొంగలిపుప్పొడిఁ దేనియలఁ దూకొని మత్తిలి తుమ్మెదల్ పయిన్
బొంగుచు వ్రాలనొప్పెసఁగు పూచిన పొన్నఁగడంగి కాంచిముక్
గ్రింగిన యావిసంబు వెస మీఁదికిఁ బిచ్చిలు వేఁడి కంటియా
జంగమటుం మ్రొముక్కనొకచాన నెంతలు చూచినవ్వఁగన్.

క. వడిఁ జనఁ దనయడుగుఁ గల । కడుఁ గెంపుఁ దనంబు పుడమిఁ గ్రమ్మినఁ దమిచే
నాడితలిరువడియె ననియుటఁ । దడవఁగ నగి రొక్క కలికిఁ దారాడు చెలుల్.

చ. మనుపొక చోటఁ దుమ్మెదలు మూఁగిన మల్లెలు గోయఁ బోయినం
జెనఁకువఁ గుట్టినం గలుగు బీతు మది దొలఁకంగఁ గ్రమ్ముచుం
దన కడకంటి చూపు పయిఁ దార్కొన గొజ్జఁగులందుఁ దేంట్లు వ్రా
లినవని చేరనోడి యొక లేమ కడుం గడఁ జోఁపుఁ దమ్మిచేన్.

పంచచామరము. సరుల్ పెనంగొనంగ జిల్గుఁ జన్నుఁ గప్పు జాఱఁగాఁ
గురుల్ వెసన్ముసల్ పొసంగఁ గూడి చాల మీఱఁగాఁ
దరుల్ బెడంకు చుండ నాని తారసిల్లి యేగి క్రొ
వ్విరుల్ గతించి కోసె నొర్తు వెంటఁ జానలంటఁగాన్.

సీ. బొట్టుగు శేమావిఁ బొదలించె నొక్కర్తు చూచియుఁ జేనంటి సొబగు మీఱఁ
బొన్నఁ బ్రేంకణమును బూయించె నొక్కర్తు చలువ పువ్వునును జాటుకు ఱఁగలింపఁ
బొగడను గంకేళిఁ దగ విరుల్ గలిగించె నెమ్మిఁ గల్లుమిసి తన్నియు నొకర్తు
కొసరి వావిలిఁ గొండగోఁగును ననిపించె మూర్కొని మాటాడి ముదితయొకతె
క్రోవిఁ బూవులు నిండించెఁ గొమ్మయొర్తు । కదసి కూరిమి తోడుత గాఁగిలించి
చనుపకంబున గ్రొన్ననల్ దనియనించె । ముదిత యొక్కతె తన ముద్దు మోముఁ జూ

కారసి కేయొడి కారవుఁగింకను । నేరము మాకిది నేరము బోఁకను
నీడకుఁ జెలి రాకీడకుఁ గోయఁగ । నాడకు రా విడనాడకు పాయఁగఁ
బనసలపైఁ బూఁబనసల్ గనుఁగొను । పనుపడ్డవి మరుపనులకు నవియును
మరువము చెలి నా మరువములోయను । కలువో విరులక్కలువోఁ గోయను
మాటకు మారకమాటకు వత్తురె । బోటులు మతిమీ బోఁటులు మెత్తురె
యనుచుఁ దగిలి సయ్యాటలఁ బాడుచు । ననవిలుకాని వినంగొని యాడుచు

వ. ఇట్లు నీటు మెఱసి తోఁటలనాడు బోటులాటసాలించి.

క. కప్పుం గొప్పులఁ జన్నుం । గప్పుల మొగముల నాడఁ గప్పిన మెఱుఁగుం
బుప్పొడి విదిరిచి కొనిమతి । యప్పడఁతుక లరిగి కప్రపసఁటులఁ జెంతన్.

సీ. పువ్వుఁదేనియ కాల్వ పొంత పొన్నలలోనఁ బోలు పొందు చెంగల్వ కొలని దరిని
బూచిన చనుపకంబులు చుట్టి వచ్చిన గురివెంద తీవ పందిరులయందుఁ
జలువల నెలవులై యలరారు నెలతాల తిన్నియల్ పన్నీటి తేటనలికి
విరివిల్తు సతని దేవేరిఁ గస్తురిఁ దమ్మి తేకుపై వ్రాసి గుఱించి నిలిపి
కమ్మవిరినీట జలకంబు గానుగూర్చి । నగవు ముత్యాల తొడవులు దగనమర్చి
కలికి క్రొన్నన పొదబాసికములు చేర్చి । సిరుల నాదరించుచును పెండ్లి సేయుచుండ

గీ. నాలిగాడ్పుచు కాలరి యోలి సరిగి । వారి వేసలి విరుల నింపారు తావు
లెల్లఁ గానుకగా నిచ్చి చెలిమిఁ బిలువ । నచట వేఁటాడుచున్న యయాతి వచ్చి.

క. తెలిమొగులలోన వెలిఁగెడు । తొలుకారు మెఱుంగు పగిదిఁ దోరపుటొజ్జపుల్
దులకించు నాటతమిచే । నలరుం బొదవెడలి వచ్చు నలశర్మిష్టన్.

వ. కాంచి యగ్గబ్బెత సోయగంబున కబ్బురపడి యబ్బలియుండు తనలోన.

సీ. తమ్ములు చక్కలు తాఁ బేళ్లు మరుపొదుల్ పసిఁడియనంటులు నిసుకతిప్ప
సుడిచదల్ బంగారు కడవలుఁ దీవియల్ చివురు చిందంబు పసిండియెద్ద
ములు తలిర్వెన్నెల మొల్లమొగ్గలు నువ్వుఁ బువ్వమీబునన దూపులును నిండ్లు
నరతొగదోరసోగ సిరి వ్రాఁత చెలువముల్ రహిమించు జేజేల రాచతాలు
నివిగదా పోలికలు చూడనింతులందు । నొడలి యొప్పులు గొని యాడుచున్న యెక
నవిబెడంగుగ నీచాన యందు సాటి । సేయవచ్చిన నేరక్కిసిగ్గు గాదె.

గీ. మరునియురులన్నఁ దగి క్లేటి సిరులవఱలు । తెలివకురులకు సరిరామి దీర్ఘఁగాక
కడిమిఁ దమ పెంపువోఁ బూరిగలవ నేల । రహియలర్ వేలుపుటిరాచ రాలకెల్ల.

క. మరుఁడర నెలకడ దాచిన । విరి దూపును నల్లచెఱకు విండ్లును బలె వే
మఱున్నలరు చేరుచుక్కయు । నరుదగు కనుబొమలు మిగుల నతివకు నమరెన్.

క. నెలఁతుక కన్నులనం గాఁ । బొలుపగు నెలవెలుఁగు మేపుఁ బులుఁగులకేమిచేఁ
గొలఁదియె యింగకతినివె । వెన్నెల గ్రక్కెడు నసఁగ నెనఁగు నెలకొనునగపుల్.
క. తమ్ములఁ బూనిల్తుని క్రొ । త్తమ్ములఁ జీరికిఁ గొనక యడకించుఁ గడుఁ
గొమ్మనిడువాలుఁ గన్నులఁ । గ్రొమ్మించులు గలిగి పొల్పు గులికెడు చూపుల్.
గీ. పెలుచఁదమ డాయుదైన సంపెంగవిరిని । గెలిచెనని ముక్కు విఱుగడఁ గొలిచియుండి
త్రుళ్ళియాడెడు తుమ్మెదపిల్లలనఁగఁ । బొలుచు నెలఁతుక చూపులు చెలువమమరం.
గీ. కప్పురము పొదులోపలఁ గరము సరది । నాటి వెన్నెలయును తేటనీటఁ దడప
మొనలు చూపిన ముత్యాల మొలకలనఁగ । నారపుతోఁడుతఁ జెలి పలువరుస దనరె.
క. లలిఁ బంచదారలోపలఁ । దిలకింపఁగ నించి జుంటితేనియలు కడుఁ
జిలుకఁగఁ బెరిగిన పగడపుఁ । దలిరనఁగా నలివ పెదవి తగుఁ గొనియాడన్.
తరల. చిలువ చెంకి మెకంబు చెట్టని చెప్ప కొంమరుకల్లయౌ
పొలఁతి నెమ్మొగముం గడంకను బోలఁ జాలక నెమ్మదిన్ 25960 25.2.73.
గలఁగి మక్కలరాయఁడెంతయుఁ గంది వెల్వెలఁబారెఁ గా
కలరువిల్తుని మేనమామగు నయ్యకాకొదగల్గునే.
గీ. చెలువ మెడ తుంటవిల్తుని బిందమరయ । నంమనిరుగడ వైచిన కుందనంపు
సరులు పూఁబోఁడి చేతులు చాలనరయఁ । గాకయుండిన నీగరగరిక గలదె.
చ. చెలిను పురుడు గడుఁ దొరయ సేనముతో నెలకొండఁ గ్రొత్తగైన
ప్వాలిమలయల్లువానితల వాడని పువ్వుయినిచ్చు నేముని
నెలఁతుక చేతులన్ బడిన నేలరవంబగు వేల్పుదాల్పున
ర్మిలినని చేగె నమ్మొగలి రేకులనం దగువాఁడి గోళ్ళగన్.
గీ. అతివచన్నులు జక్కవలగుటకేమి । సందియంబింక దండలచాయనిగిడి
రెక్కలైయుండ సొంపునఁ బిక్కటిల్లి । వలిపపయ్యెదయను చిన్నిపెనుదగులు.
క. గరగరికనిచ్చ గలుగక । బుదుదంగలఁగుటయ కాకపొలుపలరఁ గాఁదా
మరమొగ్గల పేరిటితా । మరమొగ్గలు పోలఁగలవె మగువచనుఁగవన్.
క. బంగారుఁ జీవయుంబలె । నంగునఁదగు పొలఁతిమేన నారుదనర్చున్
బొంగారు మెఱుఁగులోపలి । సింగారపు మిసిమి గ్రమ్ము జీరయు పోలెన్.
చ. మూసువునఁ దమ్మిచూలి మదిముందఱ రెఱింగినయట్లు నేర్పుతోఁ
దరులను పైఁడి బొట్టలను దానెతిరంబుగ నుంచెఁ గాక యే
పురవున నిల్పు దీనిదగు ప్రేఁకపుగుబ్బల ప్రేఁగునన్ జదల్
దొరసినయట్టి నెన్నడుము తోరపు నల్లకడంక మెచ్చెన్.

క. ఎనయ సురతిప్పయని చె । ప్పిన నేమనవచ్చుఁ జెలియ పిఱుఁదుంబలెఁ గా
ననుపోఁ యది యిటువలెఁ గడుఁ । దన్నుపో కాదనరు దానిఁ దద్దయుఁ గడఁకన్.

క. పలుపెఱఁగుల్ఁ దమ నేరుపు । కొలఁదిన్ నెఱజాణలెల్లఁ గొనియాడినని
ర్మ్యో- నాగ మెఱుఁగుఁ దొడలన్ । దలక్రిందైనమనసనంటి తరహాపొలన్.

క. తలఁకకుమకుని యేకతమునఁ । బలికిన మొఱవెట్టునపుడె పరికింపంగాఁ
బాలఁతుక చిఱుఁదొడలంగా । శిలువోలమిడాఁగి వెఱచి లెక్కింపంగన్?

మ. తమకుంబోలికలైన వేయనుమదిం దాఁ బేళ్లఁ దామల్కతో
నెమకన్ నీళ్లను నింగియున్నవన నెంతేనొప్పు నన్ గోళ్లనం
దమ్ములై మీటెడు తెల్లడాలుగమిలోనన్ గొమ్మమీఁ గాళ్లు చూ
చి మదిన్ జూడఁగ వీనిసాటిగలదే చెప్పంగ నెచ్చోటనున్.

వ. అని యిట్లు నెమ్మది నక్కొమ్మ సోయగంబులు కైవారంబులు సేయుచున్నంత.

సీ. బలుమించుతలమించు నలిమించు సిరిఁ బొల్చు మేచాయ విరులసంపెఁగలఁ జేయ
నెఱతీరు బలుమాఱు లలిఁ గేరు నెమ్మోము చెలఁగి తమ్ములను దమ్ములను జేయ
జగడాలఁ బగడాల నగుడాలుగల మోవి చెందమ్మి రేకులఁ జివుళ్ల సేయఁ
గరము చీఁకటి గప్పు కప్పువేనలియొప్పు తేఁటులకొకవింత నీటు సేయ
నలువ జగములఁ గలిగిన పొలుపు గరఁచి । యొంటవెన్నెల కరువులో నించియత్తివ
గాఁ దలంచంగఁ బోలు నీ కలికి నవుర । యనఁగ నటవచ్చునద్దేవయానఁ గాంచి.

వ. మున్నున్నెలంత నెఱింగియు నెఱుంగని వాఁడపోలెఁ జక్కఁదనంబునకు నిక్కయు...
శర్మిష్ఠఁ దెలియవలసి యక్కొమ్మకిట్లనియె.

క. పలుమాఱు నిందువత్తుము । తొలుతనినుం జూచి యెఱుఁగఁ దొయ్యలి నీకుం
గొలమెయ్యది పేరెయ్యది । యలకొమ్మయు నీవు నేమి యగుదురు చావిన్.

వ. అనవుడు.

సీ. మున్ను నన్నెఱుఁగుదు విన్నాతి వృషపర్వుఁ డను తొలువేల్పు రాయని కొమార్తె
శర్మిష్ఠ నాఁగ నీ చాన నన్నలనాఁడు నీట ద్రొబ్బించిన నెలఁత గాదె
నాటి తప్పునకు నీ నను బోఁడ్లతో నాకు వరవుడై యున్న దీవాలుఁ గంటి
ననుఁ బెండ్లియాడి మన్నన దీనిలోను గాఁగల నెలంతుక లూడిగములు సేయఁ
గడలిఁ బుట్టిన పొలఁతుకల్ కదిసికొలువ । వెలయు నలవేయిగన్నుల వేల్పువోలెఁ
బెంపుతో నిచ్చఁ గడతేని సొంపుమెఱయఁ । బడమి నాతోడి సవతిగా నడుపవలయు

వ. నావుడు నతండిట్లనియె.

క. చెలియ యీచకన్నియల నేలవేలుపుల్ । తగిలి పెండ్లియాడఁదగవుగాక
పుడమి నేలవేల్పు ప్రవ్వఁ బోఁకులరాజు । తెలిమిఁ బెండ్లియాడఁ దలఁపఁదగునె.

క. అనిపలుకు రాచవేలుపుఁ । గనుఁగొని చిఱునగవు మోముఁ గమ్మందమ్మిన్
దనరఁగ నచ్చేడియ యి । ట్లనియెన్ మదిలోనఁ గోర్కులనయము పొదలన్.

తరళ. కడఁగి విన్ము వెలుంగుదాఁ గుటిగాఁగ నబ్బలుగానలో
గనపలుచేన్న ననుంగనుంగొని యప్పుడర్మిలి నూతిలో
వెడలఁదీయుచుఁ గేలువట్టితి వేకదా యిఁకఁబెండ్లికిం
గడమ యెల్లను సొంపులింతియె కాక మీర లెఱుంగరే.

క. చదువులకు నాజ్ఞయిక డుఁ । బాదలిన నాయయ్య పాత్రపుంగూన్పరి వే
నిదితగ ననిపించెదనె । మ్మదిలోపల నీకు నింతమనికతమున్నన్.

వ. అనవుడు.

క. అట్టేని పెండ్లియయి చే । పట్టెద నిన్నను డుఁబొంగి పడఁతుక సోఁకుం
బట్టపుటాజ్ఞల నటకు । న్నెట్టనఁ బిలిపించె నతఁడు నెలదాల్పు బలెన్.

చ. చను దేరంగని మింటి మానికము నిచ్చల్ పోవు మజ్జారెయా
విను ద్రోవన్ నడయాడ కేల యిటకున్ విచ్చేసెనో యబ్బురం
బనఁగన్నల్ మిఱుమిట్లు గొల్ప మెయిచాయల్ గాయని రెండలన్
దనయున్నట్లుగఁ జేరవచ్చునతనిన్ దౌదవ్వులన్ జూచుచున్.

క. వడిఁబుడమి తేఁడు వలెవా । టిడుకొన్న పసిండి వ్రాఁత నెసఁగెడు వలువన్
నడుము బిగియించుకొని మతి । యడుగులపై వ్రాలి లేచి యతఁడును దానున్.

క. చను దెంచియు పాయు గ్రమ్మెడు । చను పకములలోని మూవిచక్కిందగు క్రా
న్న నచప్పరంబులోపలఁ । దన రేఁడు కప్పురపు జగతిఁ దమిఘున్నా రౌర్ణన్.

క. నెమ్మిఁ గూరిమి చెలులగు । కొమ్మలు వేవురును గొలువఁ గ్రొమ్మించులతో
నిమ్మగు తేనెయయుంబలె । నమ్మెయి కనివచ్చి దేవయానకడంకన్.

గీ. మ్రొక్కి లేచి కేలు మోడ్చుచుఁ దనచంద । మెల్లఁ జెప్పి యయ్యయాతిఁ జూపి
తలఁచి చూడ మున్నె తగులైతిఁ గావునఁ । బెనిమిటితఁడె నాకు విను ముతండ్రి.

ఉ. ఈవిరిబోఁడి నైకొను మిదేటికి సందియ మంచుఁ గూరిమిన్
దేవర యానతిచ్చిన మదిన్ దులకింపుచుఁ బెండ్లియాడెదన్
శ్రావలరాజు నన్నును దిరంబుగ సొంపునఁ బెంపు మీఱఁగాఁ
గావునఁ గూఁతుఁ గావలసి కాదనకీ చనువియ్యఁగాఁదగున్.

గీ. ఇకనికేయకోమదిలోన నెంచనన్ను । నారులకొసంగఁదలంచిన నాకటవిసుము
తగినపనియన కెన్నిచందములనైన । నాడలుదొఱంగుచు నిపుడ నీయడుగులాన.
క. అని తెగువఁబల్కుకు కూఁతును । గనుఁగొని మదిలోనఁగూర్మి గడలుకొనంగాఁ
దనరి యుతఁడియ్యకొనియెను । దనతలఁపునఁగ చునిమాట తలపోసి వెసన్.
వ. ఇట్లియ్యకొని రాకాసియొజ్జ తనపజ్జనున్న యయాతిరాజుఁ జూచి నీకు నిద్దేవయాన
జేకొనవచ్చునని యొడంబడిచి యారాజుకుంగూఁతును దోడ్కొని వీటఱిజెంజను
దెంచునప్పుడు వృషపర్వుండెమ్మనవచ్చి తననగర విడిది సేయుటయునతండు.
సీ. పదియాఱువన్నెల బంగారునుకజేసి పనిగడియూర ముప్పిరిగగడచి
దురములోఁ దెఱగంటి ద్వారనుగెల్చిననాఁటి కతలు వ్రాసినతోట్టికట్టుదాఁటి
కేరాచపాలఁ గూర్చిన రచ్చపట్టులో రహిఁబాడు పాటల రవలియరసి
తలపురాగనెలసంతనచేసినట్టిపెక జగతిపై ముత్యాల చవికెయొసటఁ
దమ్మికెంపులుగట్టినతావులందు । వారువము నిల్పి తఁ వెంట వచ్చినట్టి
మన్నెవారల ననుపుచు నున్నయెడను । జెంతవృషపర్వుఁడప్పుడు చేరనరిగి
మ. పాలుపొక ప్రపనఁట్లు కస్తురిమెక బుల్ మేలిజవ్వాది పి
ల్లులు రాచిల్కలు మానికంబులును జిల్గుల్ మంచి ముత్యాలు పే
రులు మేల్ బోగపురేఁ బెనుముల్ పసిఁడి తేరుల్ పల్లకుల్ లోను గా
నులుపా చేసె యయాతికిఁ దలఁపులోనుప్పొంగుచుంగూర్మితోన్.
వ. మఱియును.
సీ. జేజేలదొరప్రోలు చెఱవట్టి తెచ్చిన పొలివోనియచ్చర పువ్వుఁబోండ్లఁ
దామరచెలిపట్టి తావుగొల్లాడఁగాఁ దగులుపడ్డట్టి యేనుఁగులగముల
నని గెల్చినీటి రాయని వీడు చూఱాడి వ్రాలికైకొన్నట్టి వారువములు
నిగుడి జక్కులతేనె నేలవెల్లదోచఁగాఁగలిగిన వేల్పురాకంటు సరుల్
కోట్లకొలఁదులు బంగారుకోలువుసాల । ముంగలనునిల్పి మదిలోనఁ జెంగలించి
చేరికానుకచేసినఁ జిత్తగించి । యుడుగరలనంపె వృషపర్వు విడిదికనిపె.
క. తేజీడిగి తనయంతటి । రాజులు మేలప్పయనుచు రాఁగాఁ జనితాఁ
దేజాననుమేడలోపలి । జాజులచప్పరములో నెసంగుచునుండెన్.
గీ. అంతరక్కసియొజ్జ దానానతిచ్చి । పంపవృషపర్వుఁడప్పుడు సొంపుమైఱయఁ
బలుదెఱంగులఁ దవపారుపత్యకాంద్ర । చెలువుమీఱంగ వీడిదికైన్నెయఁ బనుప
చ. అలవలరాజు చేతి యలరమ్ములనందగు లేమి చెల్వపుం
బాలతులమోముఁ దామరలఁ బోలని సిగ్గునవీఁగిపెక్కురూ

పూలఁజెని హీరివాఁడు పొంతలఁజేరిన నిండుఁజందమా
మలవలెమీ తెరంగులల మందాగ్ర తోరణముల్ బెడంగులై.

క. గంధప్రమూఁకులకురుఁజుల । సంకులసౌంబూల చలువచప్పగములు గాఁ
బొందింపఁ గ్రమ్ముచీఁకటి । మందటిలేక మేటికట్టు మూఁకకు మేలౌ దేన్.

సీ. ఏదాఁ జూచిన మేదించి జవ్వాది బురదతో గోడలు ప్రాయువారు
నెందావుచూచినఁ బ్రాంతత్రాలూడ్చి నెత్తమ్మికెంపులగినల్ దార్చువారు
నెవ్వదిఁ జూచినఁ ద్రావులు వ్రాంగఁగా విసులచేఁ బంట్లు వేయువారు
నెతిన్నఁ జూచిన సంచుమించగు పట్లు నించి కప్పంబు గ్రమ్మి చుట్టువారు
నెచటఁ జూచిన నాటిగా నేర్పరించి । పెద్దపుత్యాలమగ్గులు పెట్టువారు
నెంచుఁ బగడపు మేడవు లెత్తువారు । నైరపీటను గలిగినవార లెల్ల.

వ. అప్పుడు.

ఉ. ఎల్లియ సోఁకుటాజ్ఞయతఁ డేప్పునఁ జేయును గూఁతు పెండ్లియుఁ
జెల్లనపైఁడి పళ్లెరములందున గంధముఁ బూలుఁ బచ్చఁ బ్రాల్
పెల్లుగ నించి పాల్తుకలు పేఁటముల్ దగఁ జెప్పి వీటిలో
నెల్లెడఁ గ్రమ్మరం దొడఁగి రింపుగ వాయిదముల్ చెలంగఁగన్.

మ. వరుసన్ శుక్రుఁడు నాఁడు వేగఁ దన చెల్వన్ జూచి యోకన్నకున్
దొరయ రూపును బాయమున్ గలిమి చెన్నుం గల్గునీనే ల తేఁ
డొరుదైక గ్గ్రదలంచినట్లు యెడసేయంబోలు నేయింకనే
ర్పరులౌ కొమ్మలఁ బంపు మా తగు పనుల్ గావింప రాణింపఁగన్.

క. వివరింప నెడము లేదిఁక । నువిదకు సోబనపు జలకమొనరింపంగా
జవరాండ్రఁ బనుపు మనవుడుఁ । బువుబోఁడియు నలరి తగిన పొలఁతులఁ బనిచెన్.

క. పనిచినఁ గొందఱు నెలఁతలు । ననిశిన సంతసముతో డసగెవుదోలంకన్
జనియుదిరిపైఁడి కలుకుల । పనిమెరవడి నలరుగరుడ పచ్చలచవికెన్.

చ. కలికి యొకర్తు చేఁదుడువఁ గస్తురిచే నరఁగల్కె నొక్కతె
దలి యొకకొమ్మ ముత్తెములు దార్చె నుమ్మగ్గుగ నోర్తు పెట్టెఁ గెం
పులపని పెండ్లిపీట యొకబోటియు బంగరుచేలవైచె నో
ర్తులలి నిద్దేవయానఁ దగఁదోడ్కొని వచ్చెను వేడ్కతో న్వెసన్.

సీ. కొప్పమెల్లన విప్పి కురులు చిక్కడలించి తలయంటె నేర్పుతోఁ బొలఁతి యోర్తు
పెసరుతోఁ గూడఁగ ప్రమచాల మేదించి నలుఁగు పెట్టెను గూర్మి మెలఁత యోర్తు
మిరిచితావులు గ్రమ్ము మంచిగంధమ్మున నటకలి యిడి యోఁదొయ్యలి యొకర్తు

బంగారుబిందెలఁ బన్నీరు గుప్పుచు జలకమార్చిరి కొందఱలరుఁబోండ్లు
వలిపెపావడఁ దలయొత్తెఁ జెలియొకర్తు । కదిసి చెంగావి సువ్వల్వఁ గట్టె నొకతె
నెఱులు నేర్పునఁ దడియార్చె నెంతయోర్తు । చెంగజాజులు వేనలిఁ జెరివె నొకతె

సీ. మట్టెలు పిల్లాండ్లు మణివీరమద్దియ లెలమిఁ దొడిగెఁ దొయ్యలి యొకర్తు
గంటల మొలనూలు కడిఁదియొడ్డాణంబు నుంగరంబులు పెట్టె నుఖిదయోర్తు
ముత్యాలపేర్లు మొగపుఁదీఁగెయు జన్నసరములు గీలించె జాణయోర్తు
పచ్చలకడియముల్ బంగారుగాజులఁ బదకముల్ సవరించె ముదితయోర్తు
తమ్మికెంపుల పంజులకమ్మదోయి । చేరుచుక్కయు ముంగర చెవులపువ్వులు
బవిరలును గొప్పవలయును బడఁతియోర్తు । దిద్దెఁ గస్తురి నామంబు దీర్చెనోర్తు

క. పోలఁతి మొగముఁ బోలుదునని । వలయంగా నిండుఁ జందమామ నువడిఁ దొ
య్యలికడకుఁ బట్టి తెచ్చెనొ । యలరుచు నననొకతె నిలువుటద్దము నిలిపెన్.

క. కారుమెఱుంగన మరుదే । పేరియఁ దాననఁగఁ బైఁడి పిడిదండన బం-
గారపు బొమ్మఁ గాసిం । గారంబున దేవయానకడఁ జెలువొందెన్.

వ. అంతనక్కడ.

సీ. పచ్చలపని నొప్పు పైఁడిముక్కాలిపీట యిడియొ వేడుకలోడ నింతియొకతె
కైదండలిచ్చి రాకలువరాయనిఁ దెచ్చి యందుఁ గూర్చుండ నుంచె నతివయోర్తు
సవతెచ్చుటను లేని చౌకట్టుపోఁగులు తిగిచెఁ గొల్కులెడల్చి మగువయోర్తు
కదుమించు డాకేలగండపెండేరంబు మెల్లన వదలించె మెలఁతయొకతె
వచ్చిసికజాజిసరములు విచ్చె నొకతె । కంటసరులును ముత్యాలకడియములును
బదకములు లోను గాఁగల బలుపసొమ్ము । లొయ్యనొయ్యన సడలించె నువిదయోర్తు.

క. నెలవంటి మొగము చెమ్మట । మొలకలఁ దగఁ గొనువణఁక ముంగురులాడన్
దలయంటె నొకతె తేఁకిఁ । గలపంబునఁ జేసి తావి గట్టిన నూనెన్.

క. సరిచేతోడవులు ద్రోయఁగ । సరగ నెఱులు దువ్వి దుస్స్వర సందము గా
సిరిగంధపు టటుకలియిడె । విరిబోఁడి యొకర్తు రాచవేలుపుదొరకున్.

చ. జలకములందు లేవనుచు సందియ మొప్పఁగ నూరకున్నఁ బై
దలి నిగికాకికన్ నగుచుఁ దామరకంటి యొకర్తు తేటవె
న్నెల పటికంపు బిందియల నించిన గొజ్జఁగి ప్రూవునీటిచేఁ
దలగడిగెన్ యయాతికి నెద్దంగడు సంతసముల్లసిల్లఁగన్.

వ. అప్పుడు.

క. ఏలనాఁగఁటి కత్తె దలిమపు । వలిపంబులు గట్టనిచ్చె వడినడుగులఁ బా
వలుదొడిగెనొక కత్తె యొక్కతె । తలఁబావడ యొత్తిగిచి తడియార్చెదగన్.

సీ. నిలువుటద్దంబొక నెలఁత చూపఁగ నోర్తు క్రొన్నెలనామంబు గోరఁదీర్చెఁ
గలికియొక్కతె రావ కల్వరాయని మేనఁ గలపంబు చేసిన గంధమలఁదెఁ
జాన యొక్కర్తుక చనుపకంబుల సరుల్ చింగులువారఁగ సికనమర్చెఁ
జెలువ యొక్కతె గప్పెఁ గలికి రాయంచచు బంగారు చెఱఁగుల పచ్చడంబు
పరగ వెలలేని చౌకట్లు బన్నసరులుఁ । బసిమి నాప్వారు పచ్చల పతకములును
గండపెండేరములులోను గాఁగఁగలుగు । సొమ్ములొకయింతి గైసేసె సొంపుమెఱయ.

క. ఎడలేదు లగనమనుచున్ । బడిబడిఁ బిలువంగ నపుడు బలువాయిదముల్
గడలు కొనం గానచ్చర । పడఁతులదవళములు పెండ్లిపాటలు నెలఁగన్.

క. వెలిరేనుఁగు పైఁ బన్నిన । యలరుంజప్పరములోన నతివలు వీచో
పులు వీవ తేఁడు రెండవ । వలరాయని పగిది వచ్చి వాకిటదిగియెన్.

గీ. కలికియొక్కతె మగమానికములగిండి । నించి పన్నీరు వోయఁగా నేలతేని
యడుగుఁదమ్ములు గడిగెఁ దొయ్యలి యొకర్తు । తుడిచె నెలగా విపయ్యెద తుదఁ జెలంగి.

ఉ. కారుమెఱుంగులం దెగడు కైపుననొప్పు నెలంతలంతబం
గారపుఁ బళ్లెరంబులవగన్ నునుముత్తెపుముగ్గులోన నిం
పారెడు కెంపుదివ్వియల నందపుఁ గెందొడవుల్ చెలంగఁగా
నారతులిచ్చి రప్పుడు యయాతికి లేనగవొప్పఁ గర్తిలన్.

ఉ. తామరకెంపులంతటను దాచిన ముక్కలి పీటమీఁదటన్
గోమలులంతఁ బెండ్లికొడుకుం దగనుంచినఁ బొల్పుమీఱఁగా
బ్రామినుకుం దెఱంగునను రక్కసియొజ్జయొసంగెఁ గూఁతునున్
గోమునఁ బెంచుకోర్కి సమకూరుటకుం దనజాసమెచ్చఁగన్.

సీ. అలనాఁడు జగములు గెలిపించినను మెచ్చి తారకుండిచ్చిన వారువములు
కనిపైఁడి కంటె రాకాసి తేఁడిచ్చిన పాపమేపుడు పచ్చ పతకములును
శివితోఁ గొడుకు పెండ్లికిఁ బిల్వనరుదెంచి బలితెచ్చి యిచ్చిన బన్నసరము
తనకు వేలుపుతేఁడు తలఁకి కానుకసేయ వృషపర్వుఁ డిచ్చిన వెలఁదిపిండు
నేమి సేయించునోయని యెదఁ గలంగి । కడలియంపిన బల్మమానిక్యములు మఱియు
మామయల్లునకిచ్చె గారామ్ము మెఱయ । హెచ్చుసొంపునఁ గూఁతును నిచ్చునపుడు.

వ. అంత్తనిట్లు కావించి తెరమఱుంగున నప్పుడమితేని నునిచిననుచుతమిం దనకూఁతుం
దోడితేర శుక్రుండు వనుచుటయు.

సీ. ఱంగుఁదీమ్ముల చాయ పుడమియొత్తకయుండఁ జిగురుమించిన తీవఁ జిలువమవుర
మ్మదితమొకర్తు పర్యేద చెఱంగున సారె చెక్కుటద్దంబుల చెమటదుడువ
మోము వంపఁగ జాఱు ముత్యాలపాపట సకియొకర్తు పలుమాఱు చక్కనిడఁగ
వాలిచ్చఁ గప్పుపల్వరుస చీఁకటిఁగ్రమ్మ మరియొకర్తు తెలనాకు మడిచి యొసఁగఁ
గలికికన్నుల చూపులుగ్రమ్మికొనుచు । సిగ్గుడఁ బటికెంపుటాకట్టు నేలయల్ల
నలరుకస్తురి నాటిన యట్లు గాఁగ । దెలివిఁ జఱుందెంచెఁ గడునానదేవయాన.

వ. ఇట్లు వచ్చిన తెఱవం దెరవలుంగున నిడి తగు తెఱఁగులు గావించిన పిదప నక్తైర
దిగిచిన సమయంబున.

గీ. తాళిగట్టెపు డెతలిరాకు బోఁడికిఁ । బుడమిఱేఁడను వేడ్కగడలు కొనఁగఁ
దనరుపెక్కువాయిదమ్ముల మ్రోఁతలు । చెలఁగిమజ్జగములు చెవుడుపఱుప.

క. చెలియొకతె యెత్తి పట్టినఁ । దలిరాకుంబోఁడి తేనితలముత్తియప్రం
దలఁబ్రాలువోసినతుదన్ । నెలఁతుకతలఁబ్రాలు వోసె నేర్పదలిర్పన్.

మ. నలిఁగెందమ్ముల చాయ కెంపుల బలెన్ రంజిల్లు నమ్ముత్తియం
బులు రాపాడుచుదోయిలింపుచును మోముంజందురున్ నవ్వువె
న్నెల లల్లల్లన సోఁకఁగా నుమిగులన్నిక్కంగ నాకున్నమ్మడిన్.
దలఁబ్రాల్ వోసె నెలంత రాచనెలకున్ దార్కొన్న కోర్కిందగన్.

గీ. మించుమీఁది పెద్ద మంచుతుంపరలన । మగువ వేనిమీఁద దిగఁగ జాఱ
నలరిపుడమి ఱేఁడు నాఁడలఁదగు ముత్తి । యంపుఁ బ్రాలు నించె సొంపు మెఱయ.

క. పోల్పఁ గొలిమిన్నుతెఱఁగున । వేల్పించిన పిదప రాచవిరివిఁటి దొరన్
వేల్పులకున్ మ్రొక్కించిరి । పొల్పడి యల పెండ్లికూఁతు సజ్జనకడఁకన్.

క. తగఁ బ్రాకెనయును దీటిచి । నగవులపనులైన వెనుక నాలవనాఁడో
ప్పుగ నాగవల్లి సేయఁగఁ । బగడవుటుప్పరిగలోనఁ బడఁతుక పెల్లన్.

సీ. చెలఁగుచు మంచిపచ్చలు దెచ్చి మేళ్చి దట్టబుగాఁ గ్రుచ్చి తాచితాచి
వెన్నెలల్ వెదచల్లు వెండిముత్తియములు నేర్పుతోఁ గ్రేవల నించి సంచి
యచటెల్లబలుగావి నద్దినట్టుగఁ జేయు నెఱిమించు కెంపుల నెఱపి నెఱపి
చెంతదివ్వెలఁబోని చీఁకట్లు వెదచల్లు తెఱఁగంటి రాఁడ్లఁదీర్చి తీర్చి
రమణమీఱఁగ గోమేధికములు చాలఁ । జెలువ మొప్పారనంచులఁ జేర్చి జేర్చి
కొలఁకునైదువ చిలుకలకొలుకులపుడు । పొలుపు దీర్చిరి మదిలోన బాదలు తమిని.

మ. చెలిచన్నుంగవ బోలఁ జాలునను చున్ జెందమ్మి పూమొగ్గలన్
జెలువల్ కిన్కను గట్టి వేసిరనఁ గాఁ జెన్నొందుచున్నాల్గు వం

క. మగఁడే కోలఁదినిన దపినఁ । దగనట్లైన నీరు కోలఁది తామర వైరయే
పగిదిన్ నడచెదవో నీ । దగు నేరుపు చూతమింక నలరుంబోఁడీ.

క. మగఁడే దుగడయు దేవర । మగువకు వేఱొండు లేదు మతిఁగావున న
మ్మగఁడో గిరంబు గుడువక । తగ దింతికి నారగింపఁ దన నెట్టియెడన్.

చ. కినియక యర్త్రిలిన్ మగని కిందగులైన యనుంగు లేగుదెంచి
చినఁ గడుఁ బెంపు సేయుఁదగుఁ జెచ్చెర నెమ్మది సంతసిల్లుచున్
దనబలఁగంబు నన్నలును దమ్ములు లోనుగ వచ్చిరేనియున్
చనిమిటి పుంప్రు పెంపునను. బ్రేముడిఁ జేయుట పాడి చెల్వకున్.

క. చూచ్చిన యింటికిఁ దగని । న్మెచ్చిన యింటికిని వన్నె యేచందమునన్
దెచ్చెదవో చూచెదఁగా । నిచ్చలు మనవంగడంబు నెన్నంబోగడన్.

గీ. వినుము మగఁడేరి నేనియు మను పఁగోరు
నలుగునట్లనె చెలువయుఁదలఁపవలయు
నన్న తమ్ముఁడు తండ్రి మామనుచుఁగూర్మి
నొంటిపాటునఁగూడి కూర్చుండఁ దగదు.

క. ఆ వెన్నుఁడు లచ్చియు బలె । దేవియు దేవరయుఁబోలెఁ దెలివిదలిర్పన్
నీవును మగఁడును బూవుం । దావియనంగూడి మనుఁడు తరలని కూర్మిన్.

చ. పెనిమిటి దండు దాడిఁ జని పెంపునఁ గ్రమ్మఱు దాఁక పీడియం
బును సిరిగందమున్ విరులు ముట్టకయుండఁదగున్ బాలంతి తే
జునఁగడు నొప్పు మట్టు సవు సొమ్ములతోఁ గులమాపుచీరతోఁ
దనకలికొప్పుతో మిగులఁ దార్కొను ముత్తెపు సేసబొట్టుతోన్.

సీ. ఇదివేల్పురాయని యనుఁగు నెచ్చెలి సుమీ బత్తితోఁ గూర్చుకవత్తుగాని
ప్రొద్దుపట్టికినిది బోనకత్తియ సుమీ ప్రోదితో దుత నడపుదువుగాని
పైదలియది గాడ్పు దాదికూఁతురు సుమీ కూర్మియుప్పొంగ సాఁకుదువుగాని
యది పైఁడి వారరాణి యనుఁగుఁ జెల్లెలు సుమీ యువిద గారవము సేయుదువుగాని
యనుచు శర్మిష్ఠ యాడిగంబ మరఁ జేయు । నలరుఁబోఁడ్లను వేర్వేఱ నప్పగించి
చెంతఁ దల వంచుకొని తన చెలుల నడుమ । విన్ననైయున్న రక్కసికన్నెఁ జూపి.

క. ఇది పుట్టుబోగి దీనికిఁ । గొదవేమియు లేకయుండఁ గూర్చుకరమ్మీ
చెదరఁగఁ జూడక నీవలె । ముదితాకటముఁ గూడ నీళ్లు మొదలగు నెడలన్.

వ. అని పెక్కుచందంబులఁ గూఁతునకుం జెప్పి పయనంబు సేయుటయును.

చ. దళముగఁ గల్వఱేకులతుదన్ దిగజాఱెఁ జుమంచునట్లు కన్
గొలుకులడిగ్గు సిరుగనిగుండెదిగుల్లనఁ దల్లియిట్లనున్
జెలువను గేలుపమ్ములను జెక్కులు నొక్కుచుఁ గౌఁగిలించుచున్
బెలవెలఁబాఱు మోముపయి విన్నదనంబు దొలంకుచుండఁగన్.

క. ఉల్లమునఁ దగవ సేటికి । నెల్లుండియ పిల్వనంపనే తెంచెదు నా
తల్లి విగడ నీతమ్ముఁడు । వల్లికయున్ దోడు రాఁగ మదినడలేలా.

ఉ. లచ్చియురూపు వన్నెగడమూ లావు సురాచతికంబు గౌరవం
బెచ్చుగఁ గల్గి యుజ్జగము నేలెడు నెన్నిటిఁ జెంది తర్కిలిన్
బిచ్చిలు సొంపుతోడ నినుఁ బెంచిన మచ్చికఁ బాయలేక కా
నొచ్చెను తేసుగా తలఁపనొక్కటియుంగన నీ తెఱంగునన్.

గీ. అనుచు గారవించి యనుఁగుఁగూఁతును దోడు । కొనుచుఁ జెలులుఁ దాను గొంత దవ్వు
వచ్చి యంత నిల్చి పచ్చలపల్లకి । లోనఁ గూర్చుండి మేను నిమిరి.

క. ఉండుమ నమ్మ క్రమ్మతి । పొండను నీ చెలులఁ దోడఁబుట్టువులగు నీ
చండు ని మాఱ్కుని నను పుచు । నిండుగఁ దగనుండు నీవు నీ పెనిమిటితోన్.

క. అని పల్కి కూఁతుర్గొంపి చఁ । జని యెన్ శుక్రుని పొలంతి చానలుఁ దానున్
నును పైఁడి గాలి చెఱఁగులఁ । బను పడి యొడి జేఁతితోడి పల్లకి గదలన్.

వ. ఇట్లు గదలుటయు శుక్రుండు వెంటనరిగి యటమున్న వెడలి పీడు విడిసియున్న యయా
తిం గనుంగొని యిట్లనియె.

క. ఏదియు నెఱుఁగదు ప్రోదిన్ । బోదునఁ బెరిగినది తేఁడ మున్నటి దసుమీ
పైదలి నేరము గలిగినఁ । గాదని తెలుపుచు గాని కడునలుగకుమీ.

వ. అని యప్పగించిన శర్మిష్ఠం జూపి యిట్లనియె.

క. చెలువున వృషపర్వుండను । బలియుని గారాపుఁబట్టి పసిబిడ్డసుమీ
వలరాచపనులఁ బెలిగాఁ । గలిగిన సొంపులను నడపఁగాఁ దగు దీనిన్.

వ. అని చెప్పి యతండు సేయు గారవంబున సంతసిల్లి.

చ. పుడమిని గల్గు తేండ్లు తగఁ బూనికఁ గానుకలిచ్చి నిచ్చనీ
యడుగుల వ్రాలఁగా జగములన్నియు నేలుచు వెండి పైఁడియుం
గొడుకులుఁ గూఁతులుం గలిగి కుఱ్ఱను లేని కపిండు పల్లకిల్
గొడుగులు శివ్వాటిల్లఁగను గూరిమితో మను పెక్కు లేండ్లొగిన్.

మ. అని దీవింపుచు శుక్రుఁడంతటను సెయ్యంబొప్పఁగాఁ గ్రమ్మఱెన్
జనరయెన్ రాజును బేసులుం గడిఁది నిస్సానంబులున్ మ్రోయఁగాఁ

గన్నుపెకున్కల్ బలువాఱదంబులు చెంగన్ వీఁపుచేరంగ నం
తను భానం గలవారలెల్లఁ గడఁకల్ దైవార నొక్కుమ్మడిన్.

క. కలపడగలెత్తి కస్తురి । కలయంపులు చల్లి యాణిగల ముత్తెప్రము
గ్గులు వెట్టి వీది వీదులఁ । గలయంగా మేలుకట్లు గట్టిరి వేడ్కన్.

చ. అరుదటు చూడఁగా నమరె సందులఁ గ్రందుగఁగుందనంపుఁ జెన్
గురుఁజులమీఁదఁ దార్కొనిన క్రొత్తగు పుత్తడిబొమ్మలెల్లెడన్
సారిదిని తేఁ సోబనపు సొంపు గనుంగొన వచ్చినట్టి య
చ్చెర పువుఁబ్రోడ్ల చందమునఁ జక్కఁదనంబుల సొంపు పెంపునన్.

సీ. ఎడలేక యుండంగ నిడిన దోరణములు పెల్లు పైఁ బడెడు కరుళ్ళుగాఁగఁ
దఱచుగాఁబెట్టిన తావి దూపపుఁ బొగల్ గుంపులై మెలఁగు మొగుళ్ళుగాఁగ
గములైన కటిమాణిక్యముల మేడలు లోనఁగలఁగిడాఁగినయట్టి మలలు గాఁగ
నెల్లప్పుడును బిక్కటిల్లు భేరుల మ్రోఁత రహిమించు తరఁగలరవలిగాఁగ
మేలిపటికంపుగోడలడాలు చాలఁ । బెంపుతోఁ బర్వు తెలినీటిసొంపుగాఁగఁ
బాడమిల్లోపల వేటొండు కడలివోలె । నెసఁగు నప్పీడు సిరిపుట్టిల్లు గాఁగ.

ఉ. మంది గుఱాలు నేనుఁగులు మావుతులున్ దొరలెన్నఁ జెక్కురై
క్రందుగఁగూర్మితో నెదురుగాఁ జనిపోఁజులు దీర్పఁ జూచుచున్
గొందలు ముందఱన్ బయిఁడి గోలల హొగ్గళు లెచ్చరింపఁగా
నిందని యామునేఁబోదలు నేనుఁగు నెక్కి మదిం జెలంగుచున్.

వ. వీడుచొచ్చి యారాజు రాచవీదిం జనునప్పుడు.

ఉ. చూడఁగ నేగుదెంచి కడుఁజుక్కల తోడుత రాయ ముత్తెపున్
మేడల మీఁది కెక్కినయుల మేనక గ్రేణి యొనర్చు బ్రాయపుం
జేడియ లబ్బురంబయిన చెంగలువల్ తగఁజల్లి రందఱున్
వేడుకతోడ రాకలువ విందుపయిన్ మదిఁగూర్చు లెచ్చఁగన్.

క. అంతట నాగసరంబుల । నింతులు తానములు మిగుల హెచ్చింపుచు సా
మంతము పరవన్ బువులు వ । సంతములో నుగనుగొనుచుఁ జనుదేమటియున్.

సీ. వేలుపు పూఁబోండ్ల గేలిసేయునాయారి చెలువలు దగవీరమలహారియును
గ్రొక్కలు మెలుఁగులుకున స్రుక్కఁగాఁ జేయువెల్దుకల్ బింగారపువీరణములు
వలరాజు పెంచినచిలుకలవలెఁ జాలఁబెంపొందు నెలఁతుకల్ పిల్లగోళ్ళు
పూఁదీఁగెలోయనఁ బాలుపొందుపడఁతుకల్ పెల్లుగాఁ బైఁడి తప్పెటలువఱియ

గలిగినవి యెల్ల నేర్పుతోఁ దలిరుఁబోండ్లు । కడఁగి క్రేంయించ పొగ్గడి కత్తెరిరిది
పైఁడికోలలుపూని వేపడఁడటంచుఁ । బల్లకీ ముందఱను బరాబరులు సేయ.

వ. అరుదెంచి.

క. ఆదట నేనుఁగుఁ డిగి తన । పైదలియుఁ దానుఁ బైఁచి పళ్ళెరముల మా
త్తైదువ లారతులిఁగాఁ । బ్రోదిఁ దన నగరు సొచ్చెఁ బూనిక మెఱయన్.

వ. అనిపుడునటమీఁది తెఱంగెట్టుండెనని యడుగుటయు.

ఉ. లాలస రీగజాంకుశ తలంపుల సొంపుల తమ్మిచూలి యు
న్నాలయు నింగి పట్టముగ నిండ నమర్చిన నీయసంబుచేఁ
గాలిమెసంగు తేని యొడికంబును జక్కల సోయగంబు మా
త్యాలి బెసంగు డిగ్గపడునట్లుగఁ జేసిన భాగ్యపుంబలీ.

క. సొలఁతులకు మేటిపగఱకుఁ । దలఁపులలో నుండు చక్కఁదనమునఁ గడుఁ జే
బలువు గడంకల నెప్పం । గల జాణల రాయ మేనుగలవల రాయా.

బంధురవృత్తము. అని మొనసెదిరెడు బలుపగతుర మూఁకను కడలింగని యేనికపోఁ
జని చెడు పఱపగునల తఱిమలచేతందగఁ బ్రదచ్చి మెలంకువ సం
తన కలిగిన గెలుపులసిరి నెఁతన్ దక్కంగైకొని యాయకతో
నెనరుగ నసపుంగలువల సైదోడ్పీటుగఁ గూర్చిన నేరుపరీ.

గద్య. ఇది శ్రీమదన గోపాల మంత్రప్రసాద లబ్ధసారస్వత సుకవిజనహితవచో
విభవ భావనామాత్య తనూభవ పొన్నికంటివంశవర్య తెలగనార్య ప్రణీ
తంబైన యయాతిచరిత్రంబను నచ్చతెనుంగుకబ్బంబునందుఁ జతుర్థాశ్వాసము.

## పంచమాశ్వాసము.

క. సిరి రాచవేల్ప కడునీ । వరితనమున నీటిదాల్ప వలమురి సుడిహా
ల్దారవంటియొప్పుగల డే । వారజాణ యమీనుఖాన వలపులతేఁడా.

వ. అటమీఁది తెఱంగు వినుండిట్లు యయాతి దేవయానం బెండ్లియై వఱలు సిరులతో
నుండునంత నక్కన్నియుం దలిమం బెక్కింపం దలంచి తలిరుంబోండ్లు.

సీ. నలువిన్నాచినఁ జాలనలరు కప్రపుఁ బావి పొలుపొందు నెమ్మేన బుగులుకొనఁగ
పేనలింధుర్ధిమినా విరి సరంబుల సొంపు లలమితేఁటుల నెల్ల నామతింపఁ
చెలివి కట్టాణిముత్తెముల పేరుల రంగు కలిమి పాలిండ్ల వెన్నెలలు గాయ
వఱపుల చిఱునవ్వు కలయఁబూఁజాలుఁగా ముద్దుఁ జెక్కులమీఁద మొలకలెత్త.

మోముఁదామరయందుపైన మురువుతోడఁ । జెలువమగు తియ్యతేనియ చేతనమరు
మరున్ని యాఅవ తూపునాఁ బరఁగునట్టి । దేవయానఁ గనుంగొని తీవిఁగదిసి.

సీ. బంగారు కుండలఁ బగటు నీ గబ్బిగుబ్బల మీఁది కొకమేలు గలుగు నేఁడు
జగడాలఁ బగడాలఁ దెగడు నీ మోవికిఁ బాలుపైన యొకడాలు గలుగు నేఁడు
మెఱుగు చేఁ గ్రొమ్మించు మించు నీ మేనికి నలరింప నొకయింపు గలుగు నేఁడు
తళ్కులై ముద్దులు గుల్కు నీ చెక్కుల కెలమిగా నొకసొంపు గలుగు నేఁడు
తాళుకొ ప్రొద్దు గ్రుంకినదాఁక ననుచుఁ । బలుకఁదనలోని కూరిమి బయలు పడఁగ
నీకకన్నుల జంకించి యేమొగాలుగు । దేవయానఁ గనుంగొని తెలివియొకతె.

క. కనినది గలిగినతీరున । నినుమగనిఁ బ్రాసికొన్న నిలువుఁ బళ్లిమలన్
గనుఁగొని యొలుఁగక పలికిన । ననబోఁడింగినియఁ దగునె నవలా నీకున్.

గీ. మగువయొన్నఁడు సిగ్గున మగనిఁ జూడ । నట్టిగోలవు నిన్నన నగునెయైన
విదియ నాఁడేను పడకున్నఁ దదియనాఁడు । కానఁబడి యోషి పకింతకనలనేల.

వ. అనినగుచుం బలుకునంత.

క. అతిముతిని గ్రుంకుమలపై । నెఱసంజను గ్రమ్మినట్టి యొరవలి సెగబి
ట్టమినఁ జనివడి గ్రుంకెన్ । బఱపున ననఁ బ్రొద్దు గ్రుంకెఁ బడమటి కడలిన్.

వ. అప్పుడు.

గీ. మెలఁత మగమానికంబుల మేడలోన । నెత్తమాడఁద మరుదెమ్ము నీవటంచుఁ
గూర్మికై దండయొసఁగి తోడ్కొనుచుఁ బోయి । చనుపకంబులనాశ్వాసు చవికయందు.

సీ. పలుకులఁ దేనియల్ గులుకఁ గోకొకంబు చెలఁగి రాఁజేయు రాచిలుకగములు
నలరిపీనుల పండువులు గాఁగ వలరాచ ప్రామిన్కు లొగి నేర్చు పారువములు
నలరుల విలుకాని గెలుపుఁ గబ్బంబులఁ జదివెడు గోరువంక కొదమ పదుపు
వినఁగూడ మరుని దేవేరిపైఁ బాటలు వాడు లేఁబాయంపు బరితములును
గవిగి పూదేఱరాయని కొలువు నేవు । పగిది నొప్పారు పసిఁడి యుప్పరిగలోనఁ
గెంపు నెఱమానికంపు వాకిటికి వచ్చి । తమ్మిరేకుల పలకల తలుపు దిగువ.

చ. బాగడలసాన రాచిలుక పుత్తడిపావలు తావి దూపపుం
బాగలుజవాది వంకతెలిమ్మ త్తెపుఁ జిప్ప పసింది గిండియుం
బగడపుఁ గోళ్ళ మంచము జమల్పఁపుం గపురంపుటాకు దిన్నె పెం
పుగముల జాలకిన్ని కయుఁ బువ్వులు మించుల నిల్వటద్దమున్.

గీ. కలిగి యొప్పారు నందు బంగారు కోళ్ళఁ । తూఁగుమంచము పై వేల్పుదొరయనుఁగుఁ గె
సొంపు పెంపున మిక్కిలి సోయగంబు । నలరఁ జెలువొందుచున్న యయాతిఁ జూచి.

చ. ననుమునిపెట్టంక సిబ్బితిగనంబడ విప్పగు గొప్ప కప్పు క్రొ
మ్ముడి విడిజాఱ నందియల మ్రోఁతకుఁదోడుగఁ దమ్మి కెంపు పెన్
గొడవులు మ్రోవఁ బయ్యెద చఱంగవ చక్కనాకెంత చూపఁగా
వడిమగుడంగ నేగుచెలువంగని నవ్వుచు నింతులింపునన్.

క. ననబోఁడియోర్తు కూడిన్ । జనికేలు దెమల్చి పట్టిచను నే నీకున్
బెనిమిటిని జూచి క్రమ్మఱఁ । బెనఁగక చనుదెమ్మటంచుఁ జేర్కొని తిగువన్.

గీ. తెఱవ యాకొమ్మ చేలు విదిర్చి వైచి । కేలఁగంబంబు పట్టి జంకించి పెనఁగ
వెలఁది మమ్మేల పెట్టెదవ్వించ నీకు । బయిటికెత్తిన దివ్వె నీదఘమునడక.

క. తక్కిన కన్నెలవలె నీ । విక్కడ బూటకము సేయ నేటికి నీకున్
మ్రొక్కెద నిఁకఁ బెనఁగకు నా । యక్కవు గద రమ్మటంచు నడుగులఁ బడియెన్.

చ. నెనిచిన సిబ్బితిం దఱిమి నెమ్మది చేరి మరందు నొంప నో
ర్వనిపనిగట్టి పట్టి చెలి రమ్మని కేలు దెమల్చి తివ్వగాఁ
జఱియుఁ బెనంగుచున్ మఱియు సన్నలవచ్చెదఁ గాని మించి పొ
మ్మనియు బెదంకియున్ మగుడి యంతట నింతట నిల్చిలాగుచున్.

వ. ఇట్లు వచ్చినం దోడ్కొని చని నెచ్చెలి యచ్చెల్వం జూపి రాజునకిట్లనియె.

క. మును పెంత కూర్మి గల్గిన । ననబోఁడికి నిట్టియెడల నానయ తగుఁ గా
వ్వనమగువ తగవునడిపెన్ । గనుఁగొనుఁడీ మీరలొండు గాఁ దలఁపకుఁడీ.

వ. అని విన్నవించి యామించుబోఁడి నారాజేని పాన్పుఁ జేర్చెనంత.

సీ. చిలుకకుఁ జదువు రాఁ జెప్పలేదా యేఁగా యనుచు వేగిరపడి చనియె నొకతెఁ
దెమ్మి యేమయ్యెనో నేఁడాటఁగ అపక యరుగు దెంచితినని సురిగె నొకతె
యీపగాకున మేఁత యిడనైతిఁగా ప్రొద్దిగొరువంకకనుచుఁ దానరిగె నొకతె
నడ నేర్పలేదాయె నను పురాయించకుఁ దడవయ్యె ననుచుఁ దాఁ దారెనొకతె
తనకు కనుసన్న తేనికిఁ దలియబోఁడి । నలము కొమ్మని చూపుచుఁ దలఁగె నొకతె
విడెముఁ జేవ్రాలివని యొక్క వెలఁది దిట్టి । ప్రాని యమ్మెడ వెలికినిఁబోయె నొకతె.

వ. అంత.

క. నను నెఱుఁగని గోలవు బలె । ననయము సిట్లనఁగి పెనఁకి యలకీతివిగదా
యని మేనత్తెయు నిమురుచు । ననబోఁడిన్ గారవించె ననలెత్తుతమిన్.

చ. పనుపడు కూర్మి నాన్కొక నెపంబునఁ జెక్కులు గొప్ప గుబ్బలున్
గనుఁగవ యంటి సిబ్బితిఁ దగన్ దొలగింపుచుఁ బాన్పుఁ జేర్చి నే

ర్పైనఁ జెలిఁ గౌఁగిటన్ బొదివి పొందెఁ గడుం గడు సేదఁదీర్చుచున్
ననవిలుకాఁడు సంతసమునం దనపూనిక యొప్పటకుబ్బఁగన్.

సీ. పుక్కిళ్ళవిడిచియుంబు లక్కపూవురపుఁ బోవిఁ బొదలెడు సన్నయొత్తులు నెలంగఁ
గౌఁగిళ్ళ బిగ్గరఁ గదియించి మేనుల నిరువుర చేతుల నెలమినలమఁ
దలిరుపైఁ దెంపులు దాచిన చందాన మునిపళ్ళనొక్కిల మోవులలరఁ
జెలఁగి పెనంగఁగూర్చిన క్రొవ్విరులు జాఱి చిక్కనకొప్పునఁ జిన్నెలమరఁ
గ్రమ్ము చెమరున నొక కొంత గరఁగి నెఱసి । బుగులుకొనిజాలు కస్తురి బొట్టుదనర
నిగురమంపున్నఁ దగిలిరస్నేలతేఁడుఁ । బడఁతియును సంతవలరాచపనులనలసి.

వ. అప్పుడు.

చ. తెలతెలవాఱెనన్ దొరల దేవర తామరకంటివాతెఱన్
బలుమొనలొత్తి మేల్కొలుపఁ బైదలి గేస్తుని మోము చెక్కుచే
నలముచుఁ జేత నువ్వులువ నంత మొలన్ సవరించి లేచి తా
నలయక వీడెమిచ్చె నతఁడప్పటి కప్పని పైఁదలంపిడన్.

వ. ఇట్లు వీడెంబొసంగి క్రమ్మఱ నారాచకొమరు కోర్కి దీర్చి నేర్పు తమినలరునంత.

చ. పెనిమిటి రైయైన వెన్నుఁడొగిఁ బ్రేముడి నిచ్చినఁ బుట్టుగ్రుంకక
ట్లను తన రెండుచేతుల నొయారము మీఱఁగ నేల కొమ్మ దా
ల్చిన పవడంపుఁ జుట్టులుఁగఁ గుఁజిందమునుంబలెఁ జూడనొప్పెనం
తనుదగఁదూర్పునన్ పెనుకఁదమ్ముఁ విందును జందమామయున్.

వ. అప్పుడప్పడంతి యొప్పులకుప్పయగు పసిండి యుప్పరిగలోనికిం జని తగుపనులు
గావించి యున్నంతం జెలులువచ్చి.

గీ. రహిని వలపులరాయని రాచలచ్చి । కరణి నొకవింత యగుసొయగమున మెఱయు
నిన్నుఁగనుఁగొనఁగాఁ గల్గెఁ గన్నులారఁ । గోర్కెలెల్లను మాకుఁ జేకూడె నేఁడు.

వ. అని పలుకం గినుకం బలెజంకించు దేవయానఁ గని యొక్కతొయ్యలి యిట్లనియె.

సీ. అదలించితివి కొమ్మ నదియే మెఱుంగుఁ బయ్యెదజాఱనీకవే య్యిగురుబోఁడి
యొఱుఁగ కన్నది దాని నేల జంకించెదు వెలఁదిరో యింకొక్క విడెము సేయు
మఱచి పల్కినది యోమగువయా యొలనాగ మెడఁ బచ్చికస్తురి మెదిచి యెఱదు
నగుచున్నది దీని దగుతప్పుఁ జూడక సందిళ్ళఁ బూయవే గంధమతివ
కనలనేటికి పీడ్వడఁ గప్పుకొన్న । మగని దుప్పటి యిచ్చి రా మగుడననిన-
నతివ బంగారునరలోనికరిగి మిగులఁ । బెరుగు సిబ్బితిచే గడెఁ బెట్టుకొనియె.

గీ. ఇట్టులరయ్యోసఁ జొచ్చిన యిగురుబోఁడిఁ । గల్లఁజేసితిమని చాలగారవించి
పిలుచుకొని వచ్చి సకియలు పెంపుసేయ । నలరె సీతీవిఁగొన్ని నాళ్ళరుగునంత.

క. పెలపెలఁబాఱె న్నాగ మ్ముం । ర్పులు మిక్కిలి సందడించెఁ బొక్కిలి వరిసెన్
నలుపెక్కెఁ జన్నుమొనలన్ । నెలకొని యప్పొదలికిని నెలమసలంగన్.

చ. కడుబలుపయ్యె నెన్నడుము గ్రంథుగ వాచవు లుప్పతిల్లె నున్
బొడ్డవులు గ్నేఁకమయ్యె మదిఁదోఁచెను గోర్కులు పాటలాటలున్
గుడుపులు నించవయ్యె మతికోర్కులు దప్పియుఁ జాలఁబుట్టె నె
న్నడలు దడంబడందొణఁగె నాతికిఁ దొమ్మిది నెల్లునిండఁగన్.

వ. అంత.

క. లలినా నెలఁతకు యదువనఁ । గలిగెం గొమరుండు కలిమి కలికికి మరుఁడున్
బలె రూపు సొంపునన్ రా । కలిమియు బలిమియును దనదుకై వడిఁదోఁచన్.

వ. ఇట్లుగలిగిన యకొమరుండు పెరుగుచున్నయెడ.

గీ. కలిమిదై వార నయ్యింతి గనియె మఱియు । నలరిదుర్వాసుఁడను రాచకలువ తేఁని
గట్టుదొరపట్టి కూరిమి గడలు కొనఁగ । నాలు మొగములు గలిగినయతనిబలెను.

వ. ఇవ్విధంబునం జెడిదంపుఁ గడిమిమగఁటిమినింగడునమరుకొమరులం గాంచె మించిన
సిరులంగొఅలు దేవయానం జూచి శర్మిష్ఠతనలోన.

క. పెనిమిటినిఁ జెంది కొడుకులఁ । గనమగువలు గోరుచుందుఁ గలదటువలెనే
పెన్మిమిటినిఁ జెంది కొడుకులఁ । గనియెనుగదె దేవయాన కణఁకెట్టిదయో.

క. ఏమనుకొనఁగలదిఁకనే । గోమునరాకాసితేని కూఁతురఁగా నే
నోములు నోఁటినో యీ । బాములఁ బడవలసె ననుచుఁబనువుచునుండెన్.

క. అంతట నాకనాఁటింతులు । సంతసమునఁ గొల్వఁ బైఁడి లెజగ్గి లెపైఁజే
మంతుల మానవులోవిరి । కొంతపు వేల్పనఁగ రాజు కొలువున్న యెడన్.

మ. కుసుమంబద్దిన వల్లె పయ్యెద చెఱంగున్ ముంగలం జెక్కి వె
క్కసమై యొప్పెడు గబ్బి గుబ్బచను గ్రేఁకంబానఁగాలేక గొ
నసియాడన్ మొలనూలిగంటలు లొగిమ్రోయన్ గొమ్మయొక్కర్తు వ
చ్చి సుమాళంబున మ్రొక్కి కానుకొసఁగెం జెంగల్వలా పేనికిన్.

ఉ. ఆవిర్లు లట్లొసంగికడునర్మిలి తోడుతఁ గొమ్మ మోమునన్
దావికిప్రాలు తుమ్మెదలఁదాఁ బలుమాఱును జోఁపుకొంచు నే
దేవతతోఁటఁ గాచుపొలఁతిన్ వినుమచ్చట సొంపుమీఱు పూఁ
దీవెలు విన్నవింపఁ జనుదెంచితి నిచ్చటి కంచునిట్లనున్.

మ. సురపొన్నల్ కలిగొట్లు చిందుగలు కర్జూరంబు లబ్బెందలున్
గురివెందల్ పొగడల్ మొగళ్ళు విరుగల్ గోరంటులున్ సంపెఁగల్
గొరుగుల్ జిన్నలు దాడిమమ్ములు మొగ్గల్ ద్రాఁకు లొక్కుమ్మడిన్
విరులం గన్నుల పండువై తనరెడిన్ వేంచేసి చూడందగున్.

క. అని విన్నవించు పలుకులు । విని సంతసమొప్ప రాజువెఱఁదుకలెల్లన్
మునువడియాడిగములతోఁ । జనుదేరం గదలి తోఁట చక్కికినరిగెన్.

గీ. ఇట్టులరిగిన రాజుతో నేగుదెంచు । కొమ్మలెల్లను బుష్పాలు గోయఁగడఁగి
మొత్తములుగూడుకొనుచును వ్వైత్తుగాఁగఁ । గడలప్రాఁకులవేత్వెఱఁ గ్రమ్ముకొనఁగ.

సీ. కొమ్మయీపొన్న పూగుత్తు లంటితివేని కొమరైన నీగబ్బి గుబ్బలాన
చెలువయీమావి లేఁజివురంటితేని నెత్తావినింపొందు నీమోనియాన
వెలఁది యీపూఁదీవియలనంటితేని సన్దొడవులతోడి నీయొడలియాన
కలికి యీకొలనిలోఁ గలువలంటితివేనికడునొప్పు నీవాలుఁగన్నులాన
యతివ యీమెట్ట దామరలంటితేని । నొడివిచాలెడ నేను నీయడుగులాన
యనుచుఁబాఁబోండ్లనెల్లఁదా నానవెట్టి । తోఁటలొయ్యారియా రాజుతోడనడచె.

ఉ. వన్నెగమీఁదఁద్రాఁకి దిగద్రావెడు తీవలచేతనొప్పెడుం
బొన్నలు జేఁడచూచితివె పూలబెడంగున నాల్గువంకలం
జెన్నుగ ద్రేలుచున్ జడలచేఁ గడుమీఱుచుఁ జెక్కురూపులా
గ్రొన్నెలఁదాల్పు వేలుపులొకోయని చూపఱు చూచిమెచ్చఁగన్.

క. బటువగు సొంపున ద్రేఁగగు । తలిరులచే మావిగములు తద్దయు మించెన్
వలరాయని తామరకెం । పుల మేడలు వోలె చక్కబోదిల కిరవై.

చ. పరువములైన గ్రొవ్విరులఁ బాయక కెంపగు దాడిమమ్ములన్
దిరముగఁ గ్రమ్ముకొట్టి పువుఁదేనియలానఁగ వచ్చి క్రమ్మఱన్
దిరుగుచుఁ జాల్పలైన మగతేఁటులు మీటెడు తేఁడచూచితే
విరివిలుకాఁడొనర్చ నలవేలిమి మంటలపైఁబొగల్ వలెన్.

క. పనసలు కెమ్మోకలఁ దగుఁ । గనుఁగొనఁగా గాడ్పుబల్మిఁ గారాకు వెక
ల్చిన చోటఁ గ్రమ్ము నెత్తురు । లనఁ జూపఱమదులకెల్ల నబ్బురమొదవన్.

చ. అరుదుగఁ బువ్వుఁదేనె కడుపారఁగఁ గ్రోలుడు నన్నుచూపినన్
బరువునదవ్వగా నెగసి పాదిరి మీఁదికి మాటిమాటికిన్
దిరిగెడుతుమ్మెదల్ వలపుదేవర పచ్చలమేడయొక్క యె
చ్చెరువుగఁ జుంటు వింటు నడిఁ జిమ్మెడు కస్తురియుండలోయనన్.

గీ. సన్నగఱువలిఁ దాడిమలు సారెసడలి । పొగడ క్రిందట రాలిన పువ్వులమరెఁ
పెరువగులమీఁదికినుక వేగిరమె రాఁగఁ । దారుఁగు మరుతేజి సెలవుల నురువులనఁగ.

క. రఁగొదవన్గఁ బూచిన యా । ముఁగ్గలి సంపెంగ లవిగొ మొగినామనిదాఁ
బాంగుచుఁ బఱపించిన మరు । బంగారు గుడారులనఁగఁ బరగెడుఁ గంటే.

ఉ. అల్లవె కోయిలల్ చిగురు టాకను నంజుచు నంజి నల్లడన్
ప్రేళ్ళఁడస్సనాముతోఁ బెరువరుల్ దమయుల్కుచు పిన్న గుండియల్
జల్లని త్రెళ్ళఁ గన్నులను జాజుదగన్వలరాచబూతపుం
బిల్లలు వోలె నచ్చకటి మేనుల చాయలు బీతు కొల్పఁగన్.

గీ. పడఁతి యొల్లాగు విన్నవింపంగ వినుచు । నరుగు చేరంగ నంతట నలయఁ దేనె
కాల్వలోఁ గొన్న తేమావి గముల నడుమ । మెఱయు పొదరింటిలో నశరీర్త్వదనరి.

గీ. అపుగుఁ దామర లాకు తోఁడలమీఁదఁ । జాఁచి పూఁబాన్పపై నొక్క సకియ మేన
నత్తమిలి మోముతావికి నలము తేంట్లఁ । జూచి నెత్తమ్మి క్రొవ్విరిఁ జోఁపుకొనుచు.

క. గరగరికనుండి రెండవ । మరుఁడుం బలె వచ్చు తేని మైపొల్పు మదిన్
బారిపొంగఁగలఁపఁగఁ గూరిమి । కరమెలమిన్ మొలక లెత్తఁ గనుఁగొని తనలోన్.

శా. ఈ రావేలుపు ప్రోఁడు తామగఁడుగా నేనోముల న్నోచెనో
కా రాకాసుల్ మొజ్జకూఁతురనుచున్ గాఁకొన్న కోర్కుల్ మదిన్
పేరల్ వెట్టఁగ లోనఁ బూవిలుతుఁడున్ ప్రేరేపఁగా నంతటన్
జేరంగాఁ జనుదెంచు రాజుఁగని లేచెన్ బాన్పుపై సిగ్గుచున్.

గీ. ఇట్లు లేచి తేనె కెదురేగి తన చేతి । కమ్మదమ్మిఁ గూర్మిఁ గానుకిచ్చి
యొడలఁ దనరు కెంపుఁ దొడవుల కెంజాయ । నిక్కఁబొడమఁ జాఁగి మ్రొక్కెనపుడు.

వ. ఇట్లు మ్రొక్కి తేని సమ్ముద్దియ గద్దెపైనుంచి తద్దయు నుద్దవిడి నతని మీఁది తమకంబు గమకంబై పర్వ నతని మదియుఁ దంపయిం దగులుట తెలిసి కలికి చిలుకలు గులుకు కిలకిల కులుకులు దొలఁకు నెలపొలుపుల నెలవుకొలుపు పలువలుకులు జెలుక మొలఁకువ నయ్యయాతికిట్లనెను.

క. వినునన్నేలిన నెలఁతకుఁ । జనిమిటి వైనపుడె నాకుఁ జనిమిటివగు చె
ట్లన నాలుఁగొడుకు వరువుడు । ననునవి పాయనిచి చదువులందును వినవే.

క. ఆదిగాన దేవయానన్ । మదిఁ గైకొని నట్లు నన్ను మన్ననమీఱన్
గొదలేక యుంచ నేలుము । వదలక వలతేని చాలి వడిఁ బడకుండన్.

గీ. అనుపుఁ దొయ్యలి యిట్లను నయ్యయాతి । కొమ్మ నినుఁ దెచ్చునాఁడె శుక్రుండు నాకు
నప్పగించుచు నొక్కటి యానతిచ్చెఁ । బడక సాలిగాఁగ దీనిని నడపుమనుచు.

వ. అని పలికి యతని యానతికి వెఱచి మిగుల నమ్రగుణమయిం దగిల్చిన తనమది
మగిడించి నగరికిం జనియెనంత శర్మిష్ఠ మరుబారికి లోనై.

ఉ. చెక్కిటఁ జెయ్యి చేర్చి సెగచిందెడియూర్పులవేఁడి మోవి తాఁ
బొక్కఁగఁ గంటినీటి తెలిబొట్లు చనుంగవ మీఁద రాల తేఁ
టిక్కడి కేలవచ్చె నను నేటికి నెవ్వగ పాలుసేసె నే
నెక్కడ నివ్విరాలి దరియింతుఁ దలంచఁగ మించు కాఁకలన్.

సీ. తావులు నెఱసి యేతావులు నిండఁగఁ బొదలి యుమ్మఁకులు పూయనేల
పూచెఁబో యీతోఁటఁ గాచు తామరకంటి పోయి విన్నపముఁ బాఁజేయనేలఁ
జేసెఁబో యిదిగటి చేసి యారావేల్పు తెలివలుగొల్వనే తేరగల
యే తెంచెఁబో వేడ్కనింతయుఁ గనిపోక చెలువుఁడియ్యోడకు వేంచేయనేలి
కోరివేంచేసెఁబో లోని గుట్టువిడిచి । మించు కూరిమి నెనె పైకొంచు వేఁడ్క
గోసరి డాసిన నతఁడియ్యకొనకచనఁగ । వలపుబలియించుకొనియిట్లు కలఁగనేల.

క. అనుచు న్నిక్కలి మదిలో । ననలెత్తెడు కోర్కి చేత నలఁగుచుఁ జెలులె
ల్లన్ను జేరి వేడుకొనఁగన్ । గినియుచు విడెమ్ముల్ల కారగింపక వగతోన్.

లయగ్రాహి.

అంచయొఁబోద నడపించ కలచిల్కఁ జదివించక నెమల్లాదమనెంచఁ దగఁగానా
డించకొగిఁ బారువపుఁటించు గులుకుబ్బ నఁదలంచక జవాది మెయినించకననల్ గో
యించక కురుల్ విరులునించి జడనీటు సవరించ కలపీణె మొరయించకకొలంకుల్
గాంచక తలంగి కడునించువిలుకాని సెగనుంచుకొని వేఁడిమిగల్గంచుమదినుండెన్.

మ. జగమైసొంపును దమ్మిమైమయుఁగు రాచెంగల్వ చేకత్తియున్
సిగపూమొగ్గల త్రాయితుల్ చిగురు కాసెన్ జెక్కినన్ జాలఁబో
ల్పగునన్ గేద్గఁగిరేకువంకియునుఁ జాయల్ మీఱఁగాఁ బువ్వుదీఁ
గెగుడెం దావలరాచయొంటరి కడుం గేడింపుచున్ జిమ్మినన్.

ఉ. కన్నులనీరు గ్రుక్కుకొని కాఁకలమైఁ దెరలంగ గుత్తపుం
జన్నుల మీఁది మత్తియపుఁ జాయలు వేల్కజాడగాఁగ నె
క్కొన్న విరాలిచేఁ దలఁకు కూరిమి నెచ్చెలిఁ జూచి విన్ననై
కన్నియ లందఱుం దమకుఁ గన్నుల నీరొలుకం గలంగుచున్.

క. కంటిరె చెలువలు వాలుం । గంటిని పూవింటిదంట కాఁకలు తనమై
నంటిన నోర్వక పొరలెడి । వింటిరె చలిపనులు సేయు వెరవిఁకవలయున్.

అని పల్కు చెలులంత నలరుఁ దేనియవాఁక । కనుపట్టు పూవులలోని క్రమ్మటుల మొక
నడుమఁ జెన్నొందు పొన్నలలోన లేమావి । కడ నొప్పు గొజ్జంగి కమ్మక్రొవ్విరి తావి
తిలకించు నెలరాలతిన్నె మీఁటటఁ జాలఁ । బొలుపొందు సుమంచి కప్పురపుఁ బల్కుల మేడల
గావించి యందుఁ జెలిగొజ్జ రేకులు నించి । యా వెలఁదుకఁ దెచ్చి యందు పైఁ దగ నుంచి
పొందిగం దివ్య మేన మాటి మాటికిఁ బూసి । మించు ముత్తెపు సరుల్ మెడ క్రిందుగా వేసి
తమ్మి మొగ్గలు దెచ్చి తలగడల్ గాఁ బెట్టి । క్రమ్ముకో లేఁదూండ్లు కడియములుగాఁ జుట్టి
కరమొప్పు చీని చెంగావి వల్వము గప్పి । విరులతేకులఁ జాలఁ వెలఁది మీఁద ను విప్పి
తలిరాకుఁ దగ నొట్టు దమ్ములఁ గీలించి । పలుమారు మాఁగి పైవలిని లాలించి
చలిపనుల్ గావింప జాలి నూనుట లేక । బలియంగ లోఁగి యప్పడఁతు లెల్ల నుమ్మాఁక
లగుచుఁ దాళఁగఁ జాలదక్కటా యిక్కొమ్మ । వగఁ గ్రాఁగుచున్న దెవ్వరు మాన్పఁ గలరమ్మ
యనుచు నెమ్మది దాల్మి యలరించు కొని చేరి । నన విల్తు మాఱానందపు మనంబు గోరి.

చ. వలపుల రాయ యిచ్చిగురు వాతెఱ కొమ్మనలంచు టెల్ల న
ప్పొలసుల బోనపుం దొరకుఁ బుట్టిన గాదిలి కూఁతురంచు నో
పోలయక యాఁడు దానిఁ జెగఁ జూచిన రోయ రె సన్నునయ్యయో
తెలియవు సీకుఁ దఁద్రిడి పగ తీఱునె దీనిఁ గన్గొంట నంతటన్.

క. పగచాటువు నీయెడ న । ట్లగుట యెఱింగియును బలియు నాము కతన ని
న్నగువన్ జెనకెద విట్టిది । తగునే వలరాజ దానిఁ దలపోయవుగా.

చ. వలపుల రాజ నీవు దళవాయల జాబిలి చిల్కుతేజి తూ
పులు నన లెంచ విల్ చెఱకు పొందుగ దేఁటులు నారి బొందడీ
తలి రేఁ మావి యంపపొది తా రెడు తెమ్మెర చుట్టమిట్టి నీ
కలవడు టెట్లు మొక్కలపుఁ టందము లబ్బురమెంచి చూచినన్.

సీ. నిగిడి తెర్వరుల గుండెలు ఝల్లురనఁ జేచ్చి పెళపెళ నార్చు కోవెలకుఁ దోడు
పలుకుపల్కునకు నింగలపు వేఁడిమి చిల్కఁ గిలకిలల్ గుల్కు చిల్కలకుఁ దోడు
మొనసి మేనులు చుఱుక్కని పొక్కఁ గా దూరి మెఱుముచు విసరు తెమ్మెరకుఁ దోడు
వీనులఁ గ్రొవ్వాఁడి వేఁడి సూదులు సొన్పులాగున మ్రోయు తేంట్లకును దోడు
నీవు పగవాఁడవుం బలె నెలఁత మీఁద । సెగలు వెద చల్లు వెన్నెలన్ దగుల వైచి
నెగులు సేయుటి గీ నీకున్న దగునె యకట । చనదె యింక నైనఁ జెలినో మఁ జంద మామ.

వ. అని వలరాయనిం గలువలరాయనిం దూఱి పలికి యచ్చెలువలు వెండియుఁ జలువలు
గావింపం దలంచినం జూచి యాచిగురుఁబోఁడి వెల్లనసిట్లనియె.

క. కతేర్తేజాలియెక్కడఁ । గడవట్టునునట్టి చల్వగా వించెదరీ
ట్యుడియోసతేలయింకను । విసువుఁడు నామీఁదికూర్మి వెలఁదుక లెల్లన్.

వ. అని పల్కునెడ.

గీ. సకియ యొక్కెల్లఁ దడియఁగాజాలి నెఱయు । చున్నకన్నీళ్లుమిక్కిలి నానరేఁజూడ
నలిగి వలరాయఁడేసిన యలరుఁ దూపు । లపుడు దాఁకినమంట చల్లార్చునట్లు.

క. ఈడగునో కావోయని । చూపన్ హత్తించునట్లు జోటి యడుగులన్
జేడియలొత్తిరి కెంజిగు । రోడకునాయక్కతాళు మొక్కింతనుచున్.

మ. దళమైమించువిశాలి కాఁకలఁ గడుందాళంగఁబూఁబోఁడిపై
కలయన్ జల్లినకప్పురంబమరె పీఁకన్ రేసి పూవింటివాఁ
డ్డలుకంబల్మఱుఁదూపుఁగ్రొవ్విరుల నేయన్ రాలుపొప్పొళ్ళునం
బలెనెత్తావులుఁ జల్వలోని మిసుమల్ పై పైఁగడున్ బర్వఁగన్.

గీ. ఇంతియెక్కడనీ దేహ దిట్టజాలి । నక్కటాయని మేనెల్ల నలమి నిమిరి
కడిఁదితమ్ములనవ్వేడు కన్నదోయి । నెలఁతయెక్క తెతేటపన్నీటఁ బడిచె.

వ. ఇట్లై అంగనం దెఱవలెల్లం జలి పనులుసేయుచుండిరంత నక్కడ యయాతియు శర్మిష్ఠం జూచినయది మొదలుతనమది బొదలు వలరాచవేఁడిమి వాఁడిమిం బొక్కుచుకొక్కయొక జూడఁగూడిన మేడలో నేకతంబునందుండి తనలోన.

సీ. ఆకొమ్మ వేనలియడుగుఁదమ్ములునాసల్ చిఱునాడల్ బొమలును మెఱుఁగుఁగొడలు
కన్నులు పిఱుఁదు మొగంబు నెన్నడుము లేఁజెక్కుళ్ళుఁ బొక్కిలి చెవులు నారు
తెలినవ్వు గబ్బిగుబ్బలు మోవి మెడయుఁబల్వరుస చేతులు వ్రేళ్ళు వాఁడిగోళ్ళుఁ
బలుమఱుఁ దేనియలొలుకు పల్కులు చెన్నుమించుల గేరు నెమ్మేనియొఱపుఁ
దగిలి మదిలోన నిలిచి యెంతయుఁ గలంప । నుకఁబలుమాఱుఁదలపుచును స్మరనుచు
మోసపోయితినంచును మోమువాంచి । చెయ్యి చెక్కిటఁ జేర్చితాఁజిన్నఁబోయి.

వ. అంతకంతకు వింతయై యెంతయుం బలియు వలరాచకాఁక వ్రేఁకంబునం బ్రొద్దు గడపుచున్నంత.

సీ. అలమి సెమ్మదినున్న యతివలే నవ్వుచేబలె నాడలెల్ల వెల్వేలుకఁ బాఱ
నాచాయమై రంగు లనుతేనెసోన చేఁదిలకించె ననఁగోర్కితీఁగసాఁగె
నానెలఁతుక మొగంబనునింపు నెలతెల్విబలెఁగన్నుఁదమ్ములుసొలవఁవ్వాణఁగె
నాతీమ చనుగొండలాన లేమినిఁ బోలెసాఁగిసిట్టూర్పులు సందడించెఁ.
భ్రాంతి తనలోననిల్చిన పాలఁతి నెప్పుడు । మఱితలం పేమియును లేక మదికిమఱుఁగ
నిగుడ్చుచూపులఁగనుఁగొంచుజగమురిత్త । చూపులనె చూచుమరుమరుల్ సోఁకిపలఁప.

క. తనమదిలోపల రాఁ జెడు । ననఁ ల్లుని కాఁక చేత నలినలియగుచున్
మును కొన్న సెగల కోర్వక । నునుబాన్పున నున్న రాజునుం గని చెల్వల్.

క. తాలిమి గలరాజగుటన్ । దాళుచునున్నాఁడు గాక తరమగునా యీ
జాలిఁ బడఁగా నిప్పులు । రాలెడు మైకాఁకనిల్ప రా డెవ్వరికిన్.

క. ఈ రాజునకిపుడుగ నాగ । తీరుఁ గావించి సేదఁ దీర్చమిదగునా
యోయుచు నా మై సెగలకుఁ । జేరఁగ రాదనుచు నెడము సేయందగునే.

వ. అని పలికి.

క. సింగారపుఁదోఁటకుఁజని । చెంగల్వల కొలనిపొంత జిన్నలకడ సం
పంగియల నడిమి యనఁటుల । చెంగట లేమావిదండ సేమంతులలోన్.

సీ. గందంపుఁబాడి పైచిగట్టించి యందుపై నెలరాలఁ గట్టిన నెలవునందుఁ
గల్వరేకుల మిద్దెఁ గావించి యాచుట్టు కురువేరు దడిగట్టి విరుల తేనెఁ
బూసి ముత్యాల కీల్బొమ్మలు లేఁదూఁడుఁ జిమ్మన గ్రోవులఁ జిమ్మనెగయ
పన్నీటు జొబ్బిల్లు పచ్చకప్రపుఁదిన్నె మీఁదఁ బుప్పొడి రవ పాదుకొల్పి
గడితపడు నట్టి వెన్నెల కళుకుల మర । మెఱయు వడగండ్ల బొమ్మల మేటి వగ్గలు
చూచి యుంబ లెగఁగఁగఁజొబుకు దనరు । నందు మీఁదటఁ దెచ్చి యయ్యాతినునిచి.

గీ. మించు కార్చిచ్చు నేత నడంచఁ బోవు । తెగువ నారాజు మై సెగల్ దీర్చఁ బూని
చలువలోనరింప సమకట్టి చెలువ లెల్లఁ । గదిసి యమ్మేటి మేని కాఁకలకుఁ గాక.

సీ. పారవారనిండఁ గప్పుగ ముప్పతిల్లెడు విరిసరుల్ కొప్పులఁ గరఁచుఁ జెరివి
చినుఁగని యనఁటి తేఁజిగురుగుబ్బల మీఁదఁ గదియంగఁ జేర్చి పయ్యెదలోనర్చి
జిలుఁగుఁ జేలల మీఁదఁ జెంగల్వ విరిరేకు లెలమిగాఁ గూర్చి యింపలరఁ గట్టి
గములుగా నెలనూడి గములుగాఁ జేతులఁదలముగాఁ దూండ్లు గుత్తములు చేసి
మఱియు నందఱుఁ దమ్ము నేమఱక వచ్చి । తెఱవ లెల్లను మిగుల వా తెఱలు వాడ
విరుల తేనియ నించి వావిరిని గంద । ము సలుగావించి మేనుల నలఁదుకొనుచు.

సీ. కురులలోఁ గదియంగఁ గ్రొత్త ప్రప్పొడిఁ దెచ్చి మేదించి నించెను మెలఁత యొకతె
యివముగా వట్టివేళ్ళ డనొప్పు పూఁదేనె యొడలిమీఁదను జల్లె నువిద యొకతె
చెలరేఁగి యనుకైన సిరిగంధమున ముంచి విరుల వీచోపుల విసరె నొకతె
పదనిచ్చి పచ్చికప్రంబునఁ గావించి కడియముల్ దాడిగను గొలికి యొకతె
కలయఁ బన్నీటఁ దడిపిన తలిరుఁ దెచ్చి । యడుగుఁదమ్ముల నొత్తెఁ దొయ్యలి యొకర్తు
చాలఁ జెల్వగు నాణిముత్యాల పేరు । లతనియక్కునఁ గీలించె నతివ యొకర్తు.

క. ఉష్ణము తేనికి నలందిన | కప్పురపుం గందములకెఁ గస్తూరియుబలెం
గప్పారుచాయలందగి | మప్పిరిగొను మేనికాఁక ముంచుకొనంగన్.
క. చెలులందఱు నీకరణిన్ | బలుదేఁగులఁగలుగు చలువపనులొనరింపన్
వలరాచ కాఁక మిక్కిలి | తలచూపి రెట్టింతయైనఁ దరలక బలియన్.

లయవిభాతి.

చెల్వలొనరించు బలుచలువలకుఁ బైనలముకలువలకుఁ బేఁటులను పులువలను లేఁబూ
మొలకలకు రావిలుక పలుకులకుఁ దెమ్మెరల బెళుకులకుఁ గ్రొన్ననల తళుకులకు నెమ్మె
యలపులకుఁ బాఱువపు సోలపులకుఁ గ్రమ్ముకొనుతలఁపులకు ముమ్మరపు వలపులకుఁ దెల్వె
న్నెలలకును గొమ్మగినుకలలకును జెంతఁదగు మొలలకును గోర్కులను వలలకును లోఁగున్.
వ. ఇట్లు వలరాచ సెగల మిగులనొగులు రాజుం గని వగలం దగిలి మగువ లిట్లనిరి.
క. మరుఁడా యెవ్వరితోడన్ | బిరుడా వడి వేడిఁ వాఁడి పూఁదూఁపులవే
పరుడా సినొంపనక్కట | యొరుఁడా యీరాజు నీకు నాగిఁ దలఁపంగన్.
క. వలరాయా వేఁడినని | తలరాయా యుంచుకైనఁ దలఁపవు మదిలోఁ
గలరా యీ రాజునకెన | లలరానే లయ్యతిట్టు కుడువఁగనీకున్.
వ. అని పల్కునంత.
శా. ఆసంబెట్టి మరుండు నొంప వగతో నానేల తేఁడిమ్మైఖిం
గాసిం బొందఁగఁ జూడలే కరుగు పీఁకన్ ద్రొబ్బద్దు వేఁగ్రుఁకినన్
బాసెన్ జక్కవ లిర్లు చాలబలిసెన్ బైఁజంబురండొప్పగాఁ
గాసెన్ వెన్నెల పిండిచల్లినకడంకన్ గల్వపూపండువై.
వ. అప్పుడు.
క. వెడవిల్తుఁడలరువింటను | గడువడి విరిదూపులేర్చి కదియింపుచు న
ప్పుడఁతిన్ రాచంపురునిన్ | గుడియెడమల నేసియేసి కోయని పేర్చెన్.
గీ. ఆంమశర్రిష్టమిక్కిలి యలమకొనుచు | మించువెన్నెలవేఁడిచే మేనువాక
బుప్పుఁబానుపుమీఁదటఁ బొరలి పొరలి | వలపురాయని చేఁత చేఁ దెలివిదఱిగి.
చ. వెడవెడఁ గన్నుమూయుఁ బలవించుఁ గనుంగవ విచ్చు రాజ నన్
విడువఁగఁ బాడియే యను గనింగని యేచెదు మేనివేఁడి నే
మిడుకఁగ నీకు నాఁడుకొల మేలటవేయను నల్గి పోవ నా
యెడనొక నేరమైనఁ గలదేయను నన్నిటఁ జూడవే యనున్.
వ. ఇట్లు పలికి మరుని పూముల్కుల కుల్కి నక్కలికిం గ్రమ్ముకొని క్రమ్మఱ ముమ్మరం
బగు తెమ్మలు గ్గాఁవింపం గొమ్మలుగడంగి.

సీ. అతివ మిక్కిలి తూలె నాలసింపఁగ నేల చల్లఁగాఁ బన్నీరు చల్లరమ్మ
చేడియ మై సెగ న్వాడె నీ చిగురాకు పరువంపుఁ క్రొవ్విరుల్ పఱవరమ్మ
పొలఁతి కెనివ యుగాఁ బూఁదేనెలో ముంచి విరులవీచోపులు వీవరమ్మ
నెలఁత కుగ్గొజ్జంగినీట మేదించిన యలరు కప్రము మేననలఁదరమ్మ
తెరలు చున్నది తొంటిముత్తెములు దిగిచి । క్రొత్తలుగఁ దెచ్చి పాలిండ్లఁ గూర్పరమ్మ
మఱిని వేఁడిమి యెంతయు మలసెనమ్మ । వెలఁది కడు సోలె నేమిగా వింతమమ్మ.

గీ. అనుచు వేవచ్చి చలిపనులొనరఁ జేసి । యలసి వేగింపఁ జాలక యతివ లెల్లఁ
గన్నుఁదమ్ములు మోడ్ప నక్కలికి యంతఁ । దనదు దండకు రాజు రాఁదలఁచి లేచి.

క. వడిఁ గేలువట్టుకొనినన్ । విడువిడుమని పోవ నట్టివెరవైననుఁ దాం
బడి నే గెడు తలఁపునఁ గ్రొ । మ్ముడి యొకచేఁ దురుము కొనుచు మోమలరంగన్.

సీ. వేఁడిమి వెదచల్లు వెన్నెలవడకునై చెయ్యి మోమున మాటు చేసికొనుచు
నుడికినట్లున్న పుప్పొడి మెట్టఁగాఁ బొక్కు నడుగుఁదమ్ములు కేలనలముకొనుచుఁ
గట్టులవలెనొప్పు కపురంపుఁ దిప్పలఁ గడునెక్కి నిట్టూర్పు విడిచికొనుచుఁ
జిలువలవలె నమగుల యడుగునఁ బడు నెలదీఁగియులఁ ద్రొక్కి యులికిపడుచుఁ
బూని తెకతెక మనియెడు పువ్వుఁదేనె । యొడలిపైఁ గాఱుచున్న నూఁది కొనుచు
నాలిగాడుపు సోఁకినఁ గీలుకొన్న । సెగకుఁ జిగురాకు మేనిపైఁ జేర్చుకొనుచు.

క. మరుఁ డొప్పి పోకపోకని । విరిదూపులఁ గదుముకొనుచు వెస నేయంగా
నరిగి పొదరింటికడ నా । విరిఁ జెలితనుఁ బ్రోచు తేని వెదకుచు నుండెన్.

వ. అంతనక్కడ.

ఉ. వేనలి క్రొవ్విరుల్ దొరఁగ పీనలఁ గమ్మలడాలు పర్వఁగాఁ
గానసియాడఁగాఁ గలికి కన్నుల చూపువిరాలిఁ గొల్పఁగా
మేను తళుక్కునన్ మెఱయ మించు నుబోలె నెలంత వచ్చి క
న్నాన యయాతిపుట్టు నడియాసల దిగ్గనలేచి యిట్లనున్.

క. మగువా యిచ్చోనిట్టిది । నగవా సెగపాలు చేసి నను నేఁచంగాఁ
దగవా యొఱపున నీకున్ । దగువాఁడను గానె యనుచుఁ దహతహఁ జనుచోన్.

సీ. కనుమించు నసఁటీనెన్ గంబముల్ తొయ్యలి తొడలంచుఁ బలుమాఱుఁ దడవి చూచు
జిగిమీఱు మాఁవి కెంజిగురాకు పూఁబోఁడి మోవియంచును బంటిమొనఁ దనర్చుఁ
బ్రాలుపైన జిగినొప్పునలరుగుత్తులఁ గొమ్మ గబ్బిగుబ్బలటంచుఁ గౌఁగిలించు
మెట్టుదామరలింతి మెట్టు దమ్ములటంచుఁ దక్కకుమ్మని సాఁగిమ్రొక్కఁ బోవు

జిలికి తేనియ లొలుకంగఁ బలవరించుఁ। గలికి చిలుకల పలుకులు కలికి యెలుఁగు
లనుచు వేమాఱుఁ జెవియొగ్గి యాలకించుఁ। గుండె ఝల్లన నేమె మెుకొ సరిపలుకు.

వ. మఱియును.

ఉ. చెలువట నిల్చినట్లు కనఁ జేతులఁ జన్గవ నొయ్యఁ బ్రాంచు వే
నలితగ నవ్వు మోముగను నవ్వఁ బిఱుంద మనఁ గేలమర్చుఁ జె
క్కిలి పులకల్ గవుంగిటనుఁ గీల్కొలుపుల్ బిగియించి యంతలోఁ
దెలియు నదేమొయనుల్ మగుడఁ దివ్వఁగఁ బోవు నెఱుంగుఁ గ్రమ్మఱన్.

గీ. అరిగి యాచందమునను నెయ్యంబెలర్పఁ। గౌఁగిలింపుచుఁ గూర్మి మిగదిసి తేనె
మోవి యానుచుఁ జెక్కిలి ముద్దువెట్టు। కొనుచు లోలోనఁ గన్నీళ్ళు గ్రుక్కుకొనుచు.

వ. చనిచని యచ్చటితో దనయట్లు మున్న వచ్చి యున్న శర్మిష్ఠం గాంచి.

క. మరుఁడసుతమి శేఁచఁ గాఁడ। గ్గరి యంతటు మిగులఁ జెలఁగు కాఁకల చేనా
— డ్డొయలం గౌఁగిటఁ జేర్చుచుఁ। బరికింపుచుఁ గల్లయనుచు బాయుచు మగుడన్.

క. కదియుచుఁ బాయుచుఁ గ్రమ్మఱఁ। గదియుచుఁ బాయుచును మిగులఁ గరకరితోఁ బో
బ్రాదరింటిలోనికిఁ జని। వదలుచు దిగజాఱు జిలుఁగు వల్వల తోడన్.

చ. మునుపుగ నాలిగా దప్ప వడిమఁద రెఱ్ఱి గియ సొల్ప నొప్పఁ గ్రొ
న్ననల యరంగు పైఁ బలరి నవ్వుచు వాతెఱలాని యానుచున్
దనియక క్రిందుమీఁదగుచుఁ దార్చి కవుంగిటఁ జేర్చుచున్ గడున్
జెనఁగిరి చిల్కతేజి దొరబీరము వాఱఁగ వారలిద్దఱున్.

క. ఈచందమునందగ వల। రాచపనుల్ దీర్చుకొనుచు రహిమీఱంగా
నా చెల్వయు రాజును మది। నీచెయ్వులు నిక్కమనుచు నెఱిఁగిరి తమలోన్.

చ. చెలువుఁడు మిక్కిలిన్ దెలిసెఁ జెందకమున్న నెలంత యొక్కచే
వలువ చెఱంగు పట్టికొని వావిరిఁ దక్కిన చేల చన్నులం
దలముచు మోము దమ్మి తనయక్కునఁ జేర్ప నెఱింగి తేఁడు వే
నలిదగఁ బట్టి యెత్తుటయు నవ్వుచుఁ జన్మటిఁ దేల్చె నింపులన్.

వ. ఇట్లు వలరాచకలయికల బలియికల సొలపు వలపులు గొలుపు తలంపుల నబ్బాలి
యుండును జెల్వయు నలరుచున్నంత.

చ. చెలువలు మేలుకాంచి తమ చెంగట రాజును గానకయ్యయో
నెలకొను కాఁకకోర్వక నేఁ డెటువోయెనో మించి కాయు వె
న్నెలవడ దాఁకి పూఁబొదల నీడకు నేగెనొ మావిచూతనో
కలువల విందు గన్గొనెనొ కాఁగిన క్రొవ్విరి తేనె మెచ్చెనో.

క. మనమరిదిని మిప్పగిదిన్ । వనరంగాఁదగునె వెట్టివారమెయకటా
పనిపూని తేనిపెదకం । జనవలదేయంచునొక్క జవరాలువడిన్.

సీ. అతనిచొప్పనఁ జనుదేర నటకమున్
వెడలిచనిదెంచి శర్మిష్ఠ వెదకఁదలఁచి
యున్న పూఁబోఁడి యలరి యయ్యెడఁగాంచి
తపనెలంతుకయంచు నెంతయుఁదలంచి.

క. ఒక్క తెవు నిటకువత్తురె । యక్కట రేయెండలోన నడుగుం దెమ్మల్
పొక్కఁగఁ జిఱుతేవన్నుం । జెక్కిలిగొట్టంగ నేమిసేయుదుఁ దల్లీ.

క. మింటికిసికవేల్పు మిక్కిలి । కంటికెసెకన్ నొచ్చి పుట్టుగానక సోఁకున్
వెంటఁబడిమరుఁడు వాలుం । గంటీ రాఁదగునె యెంతగండముగడచెన్.

వ. అనుటయు నక్కొమ్మ యిట్లనియె.　　25460
25.8.73.

క. అమ్మానిన్నెలినయ । మ్మద్దియఁగాను బుడమినసముదలిర్పన్
ద్రిమ్మరు యయాతియుడిగపుఁ । గొమ్మన్ మారాజుమరుఁడు గొల్పువిరాలిన్

క. బడలినఁగనిమె మెల్లన్ । గడుఁజల్వలు చేసె యలసి కనుమోడ్చిన నే
క్కడికిన్ బోయెనొ యడుగీ । యెడకుం బొందరిటివాఁకనేతెంచెనన్.

క. వినియక్కొమ్మయుదానికిఁ । దనరాకయునట్లు చెప్పి తళ్ళిరుంబోఁడీ
మనమిప్పాడ వెదకుదమా । యనవిని శర్మిష్ఠ లేచి యరుదెంచుటయున్.

చ. పలువనిజాళిఁబెట్టి కడవారిబలె న్నైనరుందంపక
పొంలఁతుల నందఱు న్నిదురపుచ్చి హళాహళిగాఁగ నొంచున
వ్వలపులరాజ్ఞుగూర్ప నిటవచ్చి పెనంగితిఁ దేనిఁగూడియో
మెలఁతుక మార్తుఁ జేఁదగిన మిన్నతిగొంటగదమ్మ నేరుపుల్.

గీ. అనుడుఁ గన్నులఁ జాఁకెంచి యతివమీఁద । తే. దొకయల్ల యప్పుడే పూనిపల్కి
నలరుఁబోఁడిఁ గనుఁగొని యయ్యయాతి । యుడిగపుఁగొమ్మ నవ్వుచుఁ బడఁతిఁజూచి.

క. మొగముం బోలినయంతనె । పగఁగొండల మీఁదఁజాలఁ బదిలంబుగనీ
తొగరాకొమరులనునిచితి । నగువానిచుఁ జెనకఁదరమె మాబోఁటులకున్.

గీ. అన్నన మోమరవంచి యయ్యలరుఁబోఁడి । తనదుపయ్యెద యొక్కింత తలఁగఁజూచి
సిగ్గుచే నిండుపెంపొచ్చు బిన్నిమెఱుపుఁ । బోలెఁబూఁబోదసొచ్చెమై పొలుపుదనర.

గీ. ఇట్టుపొదచొచ్చి రాజుతో నెనసక మెసఁగ । నరమరలులేని వలపులననఁగి పెనఁగి
యులసిచాలించి మఱియు నయ్యలరుఁబోఁడి । చిట్టకంబులు సేయుచుఁ జెలఁగునంత.

క. తలఁపులు నెనకూడెంగద । వెలితేమి యులేక యింత వేంచేయఁదగుక్
నెల్లతెఱవా తెనటంచును । నెలఁదుక లెఱఁగింప లేచి నెరవగు వేడ్కన్.

వృ. చెదరిన ముంగురుల్ నగవు చిందెడు లేఁగాములుఁ జిట్లుగండముల్
పెదవుల కెంపులున్ నుదుటఁ జేరిన కప్రపు సొల్పుఁ జూపులున్
నిమురలు లేమిఁ గన్గొనల సంతసిన జాజు లెసర్పుచుండఁ గాఁ
బొదరిలు వెళ్లి వచ్చెఁ దలపుల్ దగ నింతియు రాచ వేల్పుతోన్.

లయగ్రాహి.

ఇప్పగిది వచ్చి చెలి జిప్పిలు తమిన్ దగిలి చెప్పఁదగు కోరికలు గప్పుకొనుచుండన్
గొప్పలగు పుష్పాదుల తిప్పలను గ్రొన్ననల కుప్పలను జెన్నలరు నిప్పలను జాలన్
దెప్పరము గానిడిన కప్పురపుఁ దిన్నెఁ దగి యుప్పరములైన విరిచప్పరములందున్
ముప్పిరిగొనందని పెనప్పువులవింటిదొర నప్పుడు యయాతి తన చొప్పుగొని యాడన్.

చ. వలపుల ఱేఁడు సేయుకొదవంబడ కెంతయు రాజుమీఱలో
నలుకుచుఁ జూడవచ్చెనన నంతటఁ బుట్టుగుగట్టుమీఁదటన్
జెలినిదళిర్పఁ దామరలదేవర తోఁచిన ఱేఁడుఁ గొమ్మయున్
సొలపులతోడ నుతన్ నగరుఁ జొచ్చిరి లోపలి డిడ్డి త్రోవచేన్.

క. ఇనిరే యిదిపగలనుచున్ । మదినెఱుఁగక చాలఁబొదలు మరుపోడుముల్తన్
సదమదమగుచుండిరి య । మ్ముదితయు రాఱేఁడుఁ గూర్మి మించుకొనంగన్.

గీ. సరవితోడ నంత శర్మిష్ఠయందు య । యాతి గాంచె ద్రుహ్యునను నిఁబూరు
వారు నెనగి పుడమిలో రాజులెల్లను । గొలువఁదమరు తండ్రిఁ గొలుతు రెపుడు.

వ. ఇట్లు యయాతి దేవయానయందు యదువును దుర్వసుండును నన్నవారి నిర్వురను శర్మిష్ఠయందు ద్రుహ్యుండును ననుండును బూరుండును ననువారి మువ్వురఁ గాంచి.

సీ. మును కొన్న బీతుతో మొనసి వేల్పుల ఱేఁడు తన సొమ్ములెల్ల నప్పనము లిడఁగఁ
దమకుఁ గల్గిన యట్టి తమిఁ జూపి కిన్నరుల్ దండి పాటకుల చందమునఁ గొల్వఁ
జేరోలగంబున్నఁ జేక్కు కైప్రలతోడ నచ్చర పూఁబోఁడులరుగు దేర
తముఁ గావుమనుచు సంద్రముల యావల నేలు నేల ఱేఁ డెల్లఁ గానికలు పనుప
యదువు దుర్వసుఁడును ద్రుహ్యుఁ డల్ల పూరుఁ
డెపుడు నేఁ లేని కూర్మితో నెచ్చి పొదలి
నేమమగు లీవిఁ దనయానలో మెలంగఁ
గడిమితోడ యయాతి యిష్టుడమి నేలె.

సీ. ఈకబ్బమిర్తిలి నెవ్వారు చదివిన విన్నను వ్రాసిన నెన్నఁదగిన
విడిముడిచేఁ బొంగి వెండియుఁ బైఁడియుఁ ద్రవ్వితఁడము గాఁగఁ దనిలి సిరులు
కొడుకులఁ గోడండ్రఁ గూతులు మనుమలు మనుమరాండ్రును మేలిమగువ పిండ్లు
పాఁడియుఁ బంటయుఁ బల్లకీ తేజీఁగుల్ సాలగ్రామముల్ చాలఁగలిగి
ప్రొద్దుకల్వలతేఁడును బుద్ధిమి మిన్న । బలెనుదిరమైన యునికిచేఁ జెలఁగియొగి
పెంపు వేల్పుల రాయని సొంపు నొనర । మనుచునుందురు తనరు సేమముల నెప్డు.

చ. బవరపు వేఁటలోఁ బొదలి పైకొని వేరపుఁ బుల్గుమూఁకఁ గై
దువయనుచోంపుఁ గోల నెగఁదోలుచు నొప్పెడు రాయపక్కి సా
ళువుఁ డిభరాము శౌ తలఁపులోఁ గడు మెచ్చి యొసంగు మన్ననం
దవిలి యసంబులెల్లఁ బెంపలఁ బొంగ్యనఁ జేసిన భావజావిలి.

క. పెనఁకువ నయందలు జగములఁ । గొనియాడఁగఁ గోరి నట్టి కోరిక లొదవన్
మనుకతు బుశాహు కూరిమి । గని సిరులొందెడు నమీను ఖానా జానా.

మణిగణనికరము.

కలువలచెలి సెగకనుగలిగిన య । బ్బలియుని బలుకుల పడఁతుకఁ జెలి గ్రా
త్తలరుల వెలమురి నసమున నగుచున్ । బలువునఁ దగువిడు పరి తనవు బలీ.

గద్య. ఇది శ్రీమదన గోపాలమంత్రివర ప్రసాదలబ్ధ సారస్వత సుకవి జన హితవచో
వైభవ భావనామాత్య తనూభవ సౌజన్యవినయ ధుర్య పొన్నికంటి తెలగ
నార్య ప్రణీతంబైన యయాతిచరిత్రంబను నచ్చ తెనుఁగుఁ గబ్బంబునందు సర్వం
బును బంచమాశ్వాసము.

---

సంపూర్ణము.

---